ॐ

శ్రీ లక్ష్మీధర కవి విరచిత

# అద్వైత మకరన్దమ్



అనువాదకులు : స్వామి బ్రహ్మవిద్యానన్ద

శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వామి ఆశ్రమము - సోలాపూర్

ఓం శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీ లక్ష్మీధర కవి విరచిత

# అద్వైత మకరన్దమ్

## అన్వయార్థసహిత టీకా




సోలాపూర్ మహారాష్ట్రము

అనువాదకులు

## స్వామి బ్రహ్మవిద్యానన్ద

Computerized by:-Swami Brahmavidynanda

&

Brahmachari Ajay Chaitanya


Shri Sadguru Maharshi Malayalaswami Ashram,

Plot No . 48, Kalavathi Nagar ( New Sunil Nagar ),

M.I.D.C . Solapur - Maharashtra

Pin:- 413006

# విషయానుక్రమనిక


| విషయము | పృ |
|---|---|
| మూల గ్రంథములోని శ్లోకములు | I |
| టీకాకారకృత మంగళాచరణము | ౧ |
| ప్రథమ శ్లోకమునకు అవతారిక | ౩ |
| ప్రథమ శ్లోకము - మంగళాచరణము | ౫ |
| యస్య దేవే పరాభక్తిః | ౮ |
| న వ్యాపిత్వాద్దేశతోఽన్తో | ౮ |
| కృషిర్భూవాచకః శబ్దో | ౧౦ |
| రెండవ శ్లోకమునకు అవతారిక | ౧౨ |
| ఆత్మయొక్క సచ్చిదానందత్వము ౨ వ శ్లో. | ౧౩ |
| అహం శబ్దార్థః | ౧౩ |
| జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపఞ్చం యత్ | ౧౪ |
| సత్యత్వం బాధరాహిత్యం | ౧౫ |
| చిద్రూపత్వాదకర్మత్వాత్ | ౧౫ |
| ఇయమాత్మా పరానన్దః పరప్రేమాస్పదం | ౧౬ |
| జీవబ్రహ్మణోరభేదవిషయే అనుమానమ్ | ౧౬ |
| “ద్వాసుపర్ణా” ఇతి శ్రుతి తాత్పర్యం | ౧౭ |
| త్వయి మయి చ గణ్యమానే | ౧౯ |
| మూడవ శ్లోకమునకు అవతారిక | ౧౯ |
| సర్వజ్ఞత్వ,సర్వజగత్కారణత్వము ౩ వ శ్లో. | ౨౦ |
| జగన్మిథ్యాత్వే గన్ధర్వనగరనిదర్శనమ్ | ౨౧ |

# విషయానుక్రమనిక


| | |
|---|---|
| న నిరోధో నచోత్పత్తిః | ౨౧ |
| యథా స్వప్నప్రపఞ్చోఽయం | ౨౧ |
| బహుదూరవర్తి మేర్వాదీనాం ద్రష్టా కథమ్ | ౨౨ |
| జ్ఞాతరూపేణచాజ్ఞాత స్వరూపేణ చ సాక్షిణః | ౨౩ |
| ఆత్మయొక్క అవినాశిత్వము ౪ వ శ్లోకము | ౨౭ |
| ప్రత్యభిజ్ఞాజ్ఞానలక్షణమ్-భాతస్యకస్యచిత్పూర్వం | ౨౮ |
| ఆత్మనః నిరంశత్వాన్నిరవయవత్వాత్ న నాశః | ౨౯ |
| చరాచరవ్యపాశ్రయ/జీవాపేతంవావ కిలేదం | ౩౨ |
| అకృతాభ్యాగమము,కృతవిప్రనాశము | ౩౪ |
| నాభుక్తం క్షీయతే కర్మ | ౩౫ |
| పూర్వజన్మన్యసన్నేతత్కర్మసంపాదయేత్కథం | ౩౫ |
| ఆత్మనః అవినాశిత్వమ్-న శోషప్లోష ౫ వ శ్లో. | ౩౬ |
| ఆరోపితం నాశ్రయదూషకం భవేత్ | ౩౮ |
| ఆరవ శ్లోకమునకు అవతారిక | ౩౯ |
| సర్వజ్ఞత్వమ్-సర్వగతత్వమ్, ఆరవ శ్లోకము | ౩౯ |
| యదాదిత్యగతం తేజః; న తత్ర సూర్యో భాతి | ౪౧ |
| నిత్యం విభుం సర్వగతమ్-విశేష విచారణ | ౪౩ |
| అవ్యావృత్తాననుగతం వస్తు బ్రహ్మేతి భణ్యతే | ౪౬ |
| ఏడవ శ్లోకమునకు అవతారిక | ౪౭ |
| చిజ్జడయోః సంయోగసంబన్ధః, తాదత్మ్యసంబన్ధః, | |
| విషయవిషయీభావసంబన్ధః నార్హతి | ౪౮ |
| పరమార్థతః బ్రహ్మణః జగత్కారణత్వం నాస్తి | ౫౩ |
| బ్రహ్మాజ్ఞానాజ్జగజ్జన్మ బ్రహ్మణోఽకారణత్వతః | ౫౪ |

## విషయానుక్రమనిక


| | |
|---|---|
| అస్య ద్వైతేంద్రజాలస్య; బ్రహ్మాజ్ఞానాజ్జగజ్జన్మ | ౫౪ |
| అన్యథానుపపత్తిశ్చేదస్తి వస్తు ప్రసాధికా | ౫౮ |
| ఎనిమిదవ శ్లోకమునకు అవతారిక | ౫౯ |
| దేహాదీనామనాత్మత్వమ్ ౮ వ శ్లోకము | ౬౦ |
| దేహాదీనామనాత్మత్వే అనుమానప్రయోగః | ౬౨ |
| పితృభుక్తాన్నజాద్వీర్యాజ్జాతోఽన్నేనైవ వర్ధతే | ౬౩ |
| త్వన్నాసి దేహో ఘటవద్యనాత్మా | ౬౩ |
| ఉపలక్షణయా పంచకోశవివేకమపి సిద్ధమ్ | ౬౫ |
| దేహో నాహం శ్రోత్రవాగాదికాని | ౬౯ |
| తొమ్మిదవ శ్లోకమునకు అవతారిక | ౬౯ |
| అహంకారస్య అనాత్మత్వమ్ ౯ వ శ్లోకము | ౭౦ |
| శోకహర్ష భయక్రోధ లోభమోహస్పృహాదయః | ౭౨ |
| పదవ శ్లోకమునకు అవతారిక | ౭౩ |
| సుషుప్తిః; సంసారమపి అహంకారస్యైవ | |
| పదవ శ్లోకము — | ౭౪ |
| దుఃఖజన్మప్రవృత్తిదోషమిథ్యాజ్ఞానానాం-న్యా.సూ. | ౭౬ |
| ఆత్మనః కిం నిమిత్తం దుఃఖమ్ (ఆత్మానాత్మవివేకము) | ౭౭ |
| నహ్యస్త్యవిద్యా మనసాతిరిక్తా | ౭౭ |
| అహంకారస్య తాదాత్మ్యం చిచ్ఛాయా దేహ సాక్షిభిః | ౭౮ |
| న సాక్షిణం సాక్ష్యధర్మా సంస్పృశన్తి | ౮౦ |
| పదకొండవ శ్లోకమునకు అవతారిక | ౮౦ |
| ఆత్మా అవస్థాతీతః, ౧౧ వ శ్లోకము | ౮౨ |
| జాగ్రదాది అవస్థలయొక్క లక్షణములు | |

# విషయానుక్రమణిక


పండ్రెండవ శ్లోకము ౮౪

బ్రహ్మణః షడ్భావవికారశూన్యత్వమ్ ౧౩ వ శ్లో. ౮౮

ఆత్మ స్వయంప్రకాశము-శ్లో.౧౪ నుండి ౧౭ వరకు

పదునాలుగవ శ్లోకము ౯౧

పదునైదవ శ్లోకమునకు అవతారిక ౯౨

పదునైదవ శ్లోకము-న చ స్వజన్మ నాశం వా ౯౪

విశేషము:-ఆత్మయొక్క ఉత్పత్తి నాశములు తెలియవు ౯౮

పదహారవ శ్లోకమునకు అవతారిక,

ఆత్మయందు అజ్ఞానము సత్యమున్నదను శంక ౧౦౩

జ్ఞానాదేవ తు కైవల్యమితి శ్రుత్యా నిగద్యతే ౧౦౪

పైశంకయొక్క ఖండనము-పదహారవశ్లోకము ౧౦౭

మమ ముఖే జిహ్వా నాస్తి; ఘనచ్ఛన్నదృష్టి ౧౧౦

ఆత్మయందు అనిర్వచనీయ అజ్ఞానముయొక్క

స్వీకృతి, జ్ఞానముచే తన్నాశనము ౧౭ వ శ్లో. ౧౧౧

అనిర్వచనీయ శబ్దార్థము ౧౧౩

తత్త్వమస్యాది వాక్యోత్థ సమ్యగ్ధీజన్మమాత్రతః ౧౧౭

పురుషాపరాధమలినా ధిషణా ౧౧౮

భర్చువు దృష్టాంతము ౧౧౯

అసంభావన, విపరీతభావన ౧౨౦

పురుషాపరాధవిగమే తు పునః ౧౨౧

అజ్ఞానము స్వపరనిర్వాహకము ౧౨౨

విభేదజనకేఽజ్ఞానే నాశమాత్యన్తికం గతే ౧౨౫

పదునెనిమిదవ శ్లోకమునకు అవతారిక

## విషయానుక్రమనిక


| | |
|---|---|
| కర్మకాండాదులయొక్క ప్రామాణ్య వ్యవస్థ | ౧౨౫ |
| అవిద్యా విద్యమానైవ నష్టప్రజ్ఞేషు దృశ్యతే | ౧౨౫ |
| అజ్ఞానమేవ న కుతో జగతః ప్రసఙ్గో | ౧౨౫ |
| బోధాదూర్ధ్వం తన్మృషాచోత్తరం వా | ౧౨౮ |
| గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞాన తత్పరః | ౧౨౮ |
| స్వాత్మాజ్ఞానముచే స్వర్గమోక్షాది విభ్రమములు ౧౮శ్లో | ౧౨౯ |
| దీర్ఘస్వప్నమిమం విద్ధి దీర్ఘం వా చిత్తవిభ్రమమ్ | ౧౩౦ |
| మాయాకల్పిత బంధమోక్షముల కుకల్పన | ౧౩౧ |
| బాధితాఽపిపునర్మాయాభాతిదిఙ్మోహభానువత్ | ౧౩౨ |
| సత్యార్థోహి ద్విధా ప్రోక్తో | ౧౩౨ |
| దేహాత్మప్రత్యయో యద్వత్ప్రమాణత్వేన కల్పితః | ౧౩౩ |
| అన్యేనవేదితోహ్యర్థో న సత్యః పరమార్థతః | ౧౩౫ |
| పంతొమ్మిదవ శ్లోకము-చైతన్యమునందు | |
| మాయాకృత జడచేతన విభాగ వ్యవస్థ | ౧౩౬ |
| నిరుపమ నిత్య నిరంశకేఽప్యఖండే | ౧౩౮ |
| ఆత్మనః సాక్షిత్వముపలక్షణమేవ న వాస్తవమ్ ౨౦శ్లో | ౧౩౯ |
| ద్రష్టా నాఽహం దృశ్యమిథ్యాత్వ హేతోః | ౧౪౧ |
| జీవబ్రహ్మణోరైక్యబోధార్థం సముద్రఫేన | |
| స్ఫటికాద్రి నిదర్శనమ్-ఇరువది ఒకటవ శ్లోకము | ౧౪౨ |
| మాయామేఘో జగన్నీరం వర్షత్వేష | ౧౪౩ |
| అహంకారగతేచ్ఛాద్యైర్దేహవ్యాధ్యాదిభిస్తథా | ౧౪౫ |
| ఆత్మనః సద్రూపత్వం,సత్త్వస్య జాతినిరాసః, | |
| ఇరువది రెండవ శ్లోకము | ౧౪౬ |

## విషయానుక్రమనిక


| | |
|---|---|
| జాతిబాధక సంగ్రహః | ౧౪౯ |
| ఆత్మనః చిద్రూపత్వమ్, ౨౩ వ శ్లోకము | |
| ఆత్మా న జ్ఞానాశ్రయం,జ్ఞానస్య న గుణత్వమ్ | ౧౫౨ |
| జ్ఞోఽత ఏవ (బ్ర.సూ.౨-౩-౧౮) | ౧౫౬ |
| స్వయమేవానుభూతిత్వాద్విద్యతే నానుభావ్యతా | ౧౫౮ |
| అజ్ఞేయత్వము మూడువిధములు | ౧౫౯ |
| చిద్రూపత్వాదకర్మత్వాత్స్వయంజ్యోతిరితిశ్రుతేః | ౧౫౯ |
| మాసాబ్దయుగకల్పేషు గతాగమ్యేష్వనేకదా | ౧౫౯ |
| ప్రమాతా చ ప్రమాణం ప్రమేయో,నిశ్చితిస్తదా | ౧౫౯ |
| అజ్ఞానతత్కార్య తదీయభేదానధ్యక్షయన్తీ | ౧౬౦ |
| నహ్యాత్మన్యహమనహంవేతి కశ్చిత్సందిగ్ధే | ౧౬౦ |
| ఆత్మా ఆనందరూపః, ఆనందస్య న గుణత్వమ్ | |
| ఇరువది నాలుగవ శ్లోకము | ౧౬౧ |
| విత్తాత్పుత్రః పుత్రాత్పిండః | ౧౬౯ |
| ప్రత్యగభిన్నబ్రహ్మణఃఅఖండైకరసత్వే శంకా | ౧౭౧ |
| తత్సమాధానమ్; ౨౫ వ శ్లోకము | ౧౭౨ |
| భాగత్యాగలక్షణచేత జీవబ్రహ్మైక్య సిద్ధి;పరో | |
| క్షతా పరిచ్ఛిన్నతా భ్రాంతి నివృత్తి; ౨౬ వ శ్లో. | ౧౮౫ |
| దృఢాపరోక్షజ్ఞానముచే జీవన్ముక్తి, విదేహముక్తి ౨౭శ్లో | ౨౦౦ |
| కథంహ్యేకస్య స్వహృదయప్రత్యయం-విద్వదను | |
| భవములో-ఆచార్యుల భాష్యపంక్తి | ౨౦౧ |
| ఆత్మమాయా త్రిధా నశ్యతి (శాస్త్రేణ నశ్యేత్) | ౨౦౩ |
| తదధిగమే ఉత్తరపూర్వాఘయో (బ్ర.సూ) | ౨౦౪ |

## విషయానుక్రమనిక


గ్రంథాధ్యయనమునందు విద్వత్పురుషుల ప్రవృ-
త్యర్థము గ్రంథకర్త ప్రార్థన, ౨౮ వ శ్లోకము ౨౦౬

ఏవమేవ రసం సాక్షాల్లబ్ధ్వా దేహీ సనాతనః
సుఖీ భవతి (బ్రహ్మగీత ౩-౪౭) ౨౦౭

విచార్యాప్యాపరోక్షేణ బ్రహ్మాత్మానం న వేత్తి చేత్ ౨౦౮

గ్రంథాన్తే టీకాకర్తుః మంగళమ్; గురుపరంపరా
స్మరణమ్ ౨౦౯






శ్రీరామగురుబ్రహ్మణేనమః.

# అద్వైత మకరందం



శ్లో॥ న్యగ్రోధావసథార్వమస్తక మహావాణీగురుగ్రామణీ
రూపేణావతియత్సదానతగణాన్దత్వాతి విద్యాధనం
యద్దంతావళవక్త్రరూపభృదరం విఘ్నాన్హఘానాఖిలాన్
తద్ధామాహ్వాయ ముద్భవాదిరహితం బ్రహ్మాద్వితీయంభజే॥
అఖండ సచ్చిదానంద మహీజ్ఞానసగోచరం
ఆత్మానమఖిలాధారమాశ్రయేభీష్టసిద్ధయే
అస్మద్గురుసమారంభాం బాదరాయణమధ్యమాం
కమలాసనపర్యంతాం వందే గురుపరంపరాం.

శ్రీమద్గుంటుపలీ కులాంబుధి సుధాధామాభిరామోదయం
నిష్టాశ్రేష్టవశిష్టగోత్రమహిత ప్రాగ్గోత్రమిత్రోదయం
శ్రీమృత్యుంజయమంత్రిణం స్వజనకం నత్వాయశోభూషణం
చక్రేయం నిగమార్థతత్వమననం యల్లప్ప మంత్రీస్వయం॥

(శృ) తద్విజ్ఞానార్థంస గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిం శ్రోత్రియం బ్రహ్మ[illegible]
అని శృతియున్నందున నొక జిజ్ఞాసుఁడు సమిత్పాణియై శ్రోత్రియుఁడగు బ్రహ్మ[illegible]
గూర్చి॥ శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా యని యున్న [illegible]
డై నమ్మగాల్చి (శృ) శ్రోతవ్యోమంతవ్యోనిధిధ్యాసితవ్యః అని విషయవాక్యముండుటచేఁ
బ్రహ్మస్వరూపమును శ్రీగురువులవలన తెలుసుకొని కృతార్థుఁడు కావలయునని గురువుల
ను బ్రహ్మోపదేశము నభ్యర్థించిన (శ్లో) ఉపదేక్ష్యంతి తేజ్ఞానం జ్ఞానిన స్తత్వదర్శినః॥ అ
న్నారు గనుక గురువులు చెప్పుదురు. శ్లో॥ ఇదంతే నాతపస్కాయ నాభక్తాయ కదాచ
న। నచాశుశ్రూషవే వాచ్యంనచమాం యోభ్యసూయతే॥ అని యిట్టివారికి రహస్యం చెప్పఁ

గూడదనియు వినీతుఁడైన యధికారికి చెప్పవలెనియు నున్నదిగాన పరమదయాళులైన శ్రీమదాచార్యులు తాపత్రయ సహితమగు నీ సంసారస్వరూపమును తెలుసుకొని కృతార్థుఁడయ్యెదనని దృఢ జిజ్ఞాసఁగలిఁగిన మధ్యమాధికారియగు నా ముముక్షువునుఁ గూర్చి తమకు తమ శ్రీగురువులానతిచ్చిన రహస్యమైన సకల వేదాంతసారతత్త్వమును సంగ్రహముగు వాక్యరూపముగ వివరింపుచున్నాఁడు. ఓయీ! (శ్రు) తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మేతి నూ॥ అథాతో బ్రహ్మజిజ్ఞాసా॥ అని శ్రుతిసూత్రము లున్నవి గనుక నధికారియైనవాఁడు వేదాంతోక్త బ్రహ్మస్వరూపమునుఁ గురువులవలన తెలుసుకొనవలెను. కాఁగావినుమని చెప్పుచున్నాఁడు వేదాంతమన శారీర బ్రహ్మమీమాంస అందుకనుబంధ చతుష్టయముఁ గలదు. అధికారిసంబంధ విషయప్రయోజనములని విధ్యుక్తముగ వేదవేదాంగములుఁ జదివి వాటి తాత్పర్యములఁ దెలిసికొని గురుకులవాసముఁజేసి యీజన్మమందుఁగాని పూర్వజన్మమందుఁగాని

శ్లో॥ కామ్యానాం కర్మణాంన్యాసం సన్న్యాసం కవయోవిదుః
కామ్యేమతిస్త్యజ్యతాం (శ్రు) ననురాంపిబేత్ సకలంజం భక్షయేత్॥

అని యున్నది గనుక కామ్యనిషిద్ధకర్మవర్జన పూర్వకముఁగా

శ్రు॥ అహరహస్సంధ్యా ముపాసీత
యావజ్జీవ మగ్నిహోత్రంజుహుయాత్
కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమా॥

శ్లో॥ నిత్యనైమిత్తికైరేవ కుర్వాణో దురితక్షయం
జ్ఞానంచ విమలీకుర్వన్న భ్యాసేనైవపాచయేత్
అభ్యాసాత్పక్వ విజ్ఞానః కైవల్యంలభతేనరః॥

అని చెప్పియున్నందున

శ్రు॥ తద్యథేహాకర్మచితో లోకక్షీయతే
ఏవమేవాముత్రపుణ్యచితో లోకక్షీయతే॥ అని శ్రుతిన్నీ

శ్లో॥ త్యక్త్వానిత్యఫలాసంగం నిత్యతృప్తోనిరాశ్రయః
సర్వకర్మ ఫలత్యాగంతతః కురుయతాత్మవాన్ మాఫలేషుకదాచన॥

అని యున్నందుచే

శ్లో॥ మత్కర్మకృన్మత్పరమః
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషిదదాసియత్
యత్తపస్యసికౌంతేయ తత్కురుష్వమదర్పణం॥

అని యున్నదిగాన నిత్యనైమిత్తికాది సత్కర్మలు భగవదధీనంగా శ్రద్ధాను పూర్వకంగా నాచరించుటచేత నిర్మలాంతఃకరణుఁడైనవాఁడు ప్రమాత అట్టి ప్రమాత సాధన చతుష్టయ సంపన్నుఁడయ్యేనేని బ్రహ్మోపదేశమున కధికారి యిదియే సూత్రాన్వయమున్నూ,

శ్లో॥ జ్యోతిష్టోమేన స్వర్గకామోయజేత॥

అని శ్రుతియున్నదే, జ్యోతిష్టోమము కామ్యముఁ గనుక విడిచిపెట్టవలెనాయని తెలియవలసిరాగా చెప్పుచున్నారు. ఈ శ్రుతికి తాత్పర్యము.

స్వర్భిర్వేదవాక్యైర్గీయత ఇతిస్వర్గః
ఈశ్వరఇత్యర్థఃతం కామయతీతి స్వర్గకామః॥

కాగా బ్రహ్మీభూతుఁడు గావలసినవాఁడు దౌర్బ్రాహ్మణ్య నివృత్త్యర్థం నిత్యమైన యాగాదికము నాచరించ నేవలెననిన (శ్రు) పశూనాం పుష్టికామః॥ అను శ్రుతికామ్యముఁగదా యనేవు ప్రేక్షావంతునికి ప్రరోచనార్థం చెప్పుటయేగాని సూ॥ అగ్నిహోత్రాదితు తత్కార్యాయైవ తద్దర్శనాత్॥ అని బ్రహ్మసూత్రమున్నందుచే సకలవేదోక్త యాగములు నిత్యములే యగును గాన ఫలరహితముగ నాచరించనేవలెను. కామ్య కర్మలను విడువవలయుననిని మునుపు చెప్పి యిప్పుడీలాగుగా చెప్పితిరే యనవలదు. ఇవి నిత్యకామ్యములుఁగాన ఆచరించనే వలయును. ఇదిగాక ఫలరహితముగ చేసిన కామ్యమైనను నిర్దోషముగనే యుండును గాన నాచరించినను దోషములేదు అని చెప్పి సాధన చతుష్టయమనఁగా నిత్యానిత్యవస్తువివేకము. ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాదిషట్క సంపత్తి మోక్షేచ్ఛ యిందుల వివరము బ్రహ్మమొకటే నిత్యము బ్రహ్మమంటాపితమయిన జీవేశ్వరాది సకలప్రపంచమున్నూ అనిత్య మని యెఱింగెడిది నిత్యానిత్యవస్తు వివేకము, ఇహమందు దేహ ప్రారబ్ధవశమున కర్మనిర్మితములగు స్రక్చందన వనితాదిభోగములు అనిత్యములయినట్టు స్వర్గాదులయందలి రంభాసంభోగాదికములున్నూ అనిత్యములని స్పృహలేకయుండుట ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, శమము, దమము, ఉపరతి, తితిక్షసమాధానము, శ్రద్ధ యీ యారును శమాదిషట్క సంపత్తి శమమన నంతరిం

ద్రియములగు మనోబుద్ధ్యాదుల నిగ్రహము. దమమన బాహ్యేంద్రియ నిగ్రహము. ఉపరతియన నంతరింద్రియ బాహ్యేంద్రియముల ప్రవృత్తులను నివర్తింపఁజేసి యేవిషయములయందును స్పృహలేకయుండుట. తితిక్షయన శీతోష్ణాది ద్వంద్వముల సహించుటయన, యండలమను, వానలమను నోర్చుటగాదు. ప్రారబ్ధవశమున సుఖదుఃఖముల నన్నింటిని సహించుట. సమాధానమన, విషయప్రవృత్తములగు మనస్సు మొదలగు సకలేంద్రియములున్నా వేదాంత విచారమందే నిల్పుట. శ్రద్ధయన, గురూపదిష్ట వేదాంత వాక్యములయందే విశ్వాసముంచుట. ఈ యారును శమాదిషట్క సంపత్తి మోక్షమందలి యిచ్ఛ మోక్షేచ్ఛ యిదిగలవాఁ డధికారి. విషయమన జీవాత్మ పరమాత్మలయొక్క ఐక్యము. సంబంధమన వేదాంతశాస్త్రమునకును, జీవాభిన్న సాక్షిచైతన్యమునకును, ప్రతిపాద్యప్రతిపాదకభావము. ప్రయోజనమన, నవిద్యాత్యంతోపరతి యీ యనుబంధ చతుష్టయమున్నాప్రేక్షావంతుని ప్రవృత్తిసాధకము యిటులఁజెప్పి యిక బ్రహ్మనిరూపణము చేయుచున్నారు. నోయీ! యీసృష్టికి పూర్వమం దఖండమై పూర్ణమై నామరూపరహితమై, నిత్యమైన చైతన్య మొక్కటియేయుండును. ఇందుకు ప్రమాణములు

శ్రు॥ ఏకమేవా ద్వితీయం బ్రహ్మ । బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్
ఆత్మావా ఇదమగ్రఆసీత్ । సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్॥

శ్లో॥ అనాదిమత్పరంబ్రహ్మ నసత్తన్నా సదుచ్యతే॥

అని శ్రుతిస్మృతి సహస్రములు చెప్పుచున్నవి గనుక బ్రహ్మము అపవర్గస్వరూపమై ఒక్కటేయుండును. ఆతరువాతను

శ్రు॥ పాదోస్యవిశ్వాభూతాని త్రిపాదస్యా మృతందివి॥

అని శ్రుతిగాన నమృతస్వరూపముండఁగా, పాదవిభూతి యాబ్రహ్మమందు త్రిగుణాత్మకమై, భ్రాంతిభావరూపమై, బ్రహ్మజ్ఞానమువలన నశించిపోవునట్టి యొక ప్రకృతి మిథ్యా సంబంధమునకుండును యిందుకు సమ్మతి

శ్రు॥ అజామేకాంలోహితశుక్ల కృష్ణాం
బహ్వీం ప్రజాంజనయంతీగ్ం సరూపాః॥

శ్రు॥ ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి
యుతేర్థంయాత్ప్రతీయేత ప్రతీయేత నచాత్మని
తద్విద్యాదాత్మనోమాయాం యథాభాసోయథాతమః॥

అని శ్రుతిస్మృతులున్నవి గనుక మూఁడువర్ణముల సూత్రంకలియబెనచినట్టుండి ప్రధానమనిపించుకొని అనాదియై మిథ్యారూపానయుండును. అదియే సృష్టిమత్త్రైప్రకృతిమహదహంకారము లనిపించుకొనును. అది శుక్తియందు రజతము తోఁచినట్టున్నూ, రజ్జువందు సర్పముతోఁచినట్టున్నూ, సవిలాసముగ తోఁచెను.

శ్లో॥ మాయాంతు ప్రకృతింవిద్ధిమాయినంతు మహేశ్వరం
మమయోనిర్మహద్బ్రహ్మతస్మిన్గర్భందధామ్యహం॥

అని శ్రుతులు స్మృతులుఁగలవుగాన ప్రకృతిపురుషుల మిథ్యాయోగమువల్లను ప్రపంచమాయెను. ఆప్రకృతి శుద్ధసత్వగుణప్రధానమై మాయయనఁబడును. మలినసత్వగుణప్రధానయై యవిద్యయనఁబడును. ఆ యవిద్యయం దావరణశక్తియు విక్షేపశక్తియు రెండుగలవు. ఆవరణశక్తి స్వరూపముఁగప్పును, విక్షేపశక్తి గురుకటాక్షముచేతను స్వరూపముతోఁచినప్పటికిన్నీ తిరుగ ప్రపంచముతోఁపించును. యిక ఈశ్వరుఁడనఁగా మాయయంచు ప్రతిబింబించిన చైతన్యము, అదియె శబలబ్రహ్మము, యీతనికే అంతర్యామియనిన్నీ, అవ్యాకృతుఁడనిన్నీ యందురు. ఇందుకు శ్రుతి

"ఏకోదేవస్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా
సర్వాధ్యక్షస్సర్వభూతాధివాసస్సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ॥"

ఇదిగాక ఈశ్వరుఁడు రజోగుణప్రధానుఁడై యుత్పత్తియందు బ్రహ్మయు సత్వగుణప్రధానుఁడై పోషణమందు విష్ణువును, తమోగుణప్రధానుఁడై లయమందు రుద్రుఁడును అని వ్యవహరింపఁబడును. ఈత్రిమూర్తులకుల లీలావిభూతులు, పాసకులకు బహువిధముల యుపాస్యములై యుండును. ఇదిగాక సమస్తజీవాదృష్టవాసనలు సప్రకృతికుఁడగు నీశ్వరునియందు పైనప్పుండయందు సువర్ణప్రపొళ్లువలె లీనమైయుండును. జీవాదృష్టముచే నీశ్వరుఁడు మాయనుచూడ సృష్టియగును. ఇందుకు శ్రుతి

"సఐక్షత బహుస్యాం ప్రజాయేయేతి" సూ॥ ఈక్షతేర్నాశబ్దః॥

అని శ్రుతిసూత్రములున్నవిగాన యీసృజనమందు పాదానకారణమనియు నిమిత్తకారణమనియు రెండు కలవు. అదెట్లనిన ఘటశరావాదులకు మృత్తికయుపాదానకారణము. కులాలదండచీవరాదులు నిమిత్తకారణము, పటమునకు తంతువులు పాదానకారణము, తంతువాయతురీవేమాదులు నిమిత్తకారణము, యిక్కడ దృష్టాంతమందెటుల చెప్పుదుమనిన మాయకు నిమిత్తకారణత్వము చెప్పఁగూడదు. అచేతనముగాన చేతనమనిన నద్వైతహానియు శ్రుతివిరోధము కలుగును. గాన యుపాదాన కారణ నిమిత్తకారణము

లయిన యీరెండు ధర్మములు ఈశ్వరునిచే చెప్పవలెను. రెండు ధర్మము లొక్కరికే క లవా? యనిన నూర్ణనాభియను జంతువు దేహముతమోజన్యము గనుక దేహమునుఁగూర్చి యుపాదానకారణమున్ను సత్వాంశసముదాయమయిన బుద్ధినిఁగూర్చి నిమిత్తకారణము న్ను కలిగినట్టు కఁటిమి గనుక నీశ్వరుడున్ను సత్వవిజృంభితమైన మాయతోఁగూడి నిమి త్తకారణమున్ను తమోజృంభితమైన మాయతోఁగూడి యుపాదానకారణమున్ను అయె ను. ఈయుభయధర్మములుగల యీశ్వరునివలన జగత్తాయను కొందరు దండచీవరతురివే మాదులచేతనములు గదా. అలాగే మాయకుఁ జప్పఁగూడుననియందురు గాని కూడదని యే సిద్ధాంతము. ఇకను జీవుని స్థితిఁజెప్పుచున్నారు అవిద్యయందు ప్రతిబింబించిన చై తన్యము జీవుఁడు. మరియు అంతఃకరణావచ్ఛిన్న చైతన్యముఁ జీవుఁడని వాచస్పతిమిశ్రు లవారు వ్యవహరించినారు. అంతఃకరణములు భిన్నములుగాన జీవులకు నానాత్వం కలుఁ గ నట్టుఁగా విచారించినారు. ఈరెండు పక్షములు నద్వైతసిద్ధాంతమేను. శుద్ధచైతన్య ము సమష్ట్యుపాధినిఁబట్టి ఈశ్వరుఁడున్ను ఆయీశ్వరుఁడు వ్యష్ట్యుపాధినిఁబట్టి జీవుఁడు న్ను అని జగత్కల్పనకు శృతిస్మృతుల సమ్మతిఁజెప్పుచున్నారు.

శృ॥ యోబ్రహ్మాణం విదథాతిపూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతితస్మై
హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే భూతస్యజాతఃపతిరేక ఆసీత్
తత్సృష్ట్వాతదేవాను ప్రవిశత్
ఏకఏవహిభూతాత్మాభూతేభూతేవ్యవస్థితః
ఏకధాబహుధాచైవదృశ్యతే జలచంద్రవత్॥
ఏషఏవమహానాత్మాసోహంకారోభిధీయతే
సజీవస్సోంతరాత్మేతిగీయతేతత్వచింతకైరితి
నిస్సరంతియధాలోహపిండాత్తప్తాస్ఫులింగకా।
సకాశాదాత్మనస్తద్వత్ప్రభవంతి జగంతిహి
సహస్రశీర్షాపురుషస్సహస్రాక్షస్సహస్రపాత్
సభూమిం విశ్వతోవృత్వాత్యతిష్టద్దశాంగులం
ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్టతి
భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా
అహమాత్మాగుడాకేశ సర్వభూతాశయస్థితః
యధాప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమంరవిః
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేనస్థితో జగత్
క్షేత్రజ్ఞం చాపిమాంవిద్ధి సర్వక్షేత్రేషుభారత

యథామహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను
ప్రవిష్టాన్యప్రవిష్టానితథా తేషునతేష్వహం॥

ఈలాగుగా నున్నవి. అంతఃకరణమందు ప్రతిబింబించిన చైతన్యము చిదాభాసుఁడనఁబడును. శుద్ధసత్వగుణప్రధానమయిన మాయోపాధిఁగలవాఁడు ఈశ్వరుఁడుకాఁగా నీశ్వరుఁడు సర్వజ్ఞత్వాదిగుణములుఁ గలవాఁడయ్యెను. మలిన సత్వగుణప్రధానమైన అవిద్యోపాధిఁగలవాఁడు గాఁగాఁజీవుఁడు కించిద్జ్ఞుఁడాయెను. ఇక నీశ్వరునివలన ప్రపంచము పుట్టినందుకు ప్రమాణములు.

శ్రు॥ యతోవా ఇమానిభూతానిజాయంతే॥ అని తటస్థలక్షణశ్రుతిన్ని,

సూ॥ జన్మాద్యస్యయతః॥

అని సూత్రమున్నూ వున్నది గనుక సృష్టి ఈశ్వరునివలననే యాయెను. అదెటులననిన చెప్పుచున్నారు.

శ్రు॥ సఈక్షతబహుస్యాం ప్రజాయేతి
తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః
ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నే రాపః అద్భ్యః పృథివీ॥

అని శ్రుతియున్నది గనుక సృష్టిక్రమముఁ జెప్పుచున్నారు. ఈశ్వరుఁడు మాయను చూడఁగనే ఆఈక్షవల్లను త్రిగుణాత్మకమైన ఆకాశముపుట్టెను. పరస్పరాను ప్రవేశముచే నాయాకాశ విశిష్టచైతన్యమువల్లనుండి త్రిగుణాత్మికమైన వాయువుపుట్టెను. ఆ వాయు విశిష్టచైతన్యమువల్లను త్రిగుణాత్మకమైన అగ్ని పుట్టెను. ఆయగ్ని విశిష్టచైతన్యమువల్లనుండి త్రిగుణాత్మకమైన అప్పుపుట్టెను. ఆయబ్విశిష్టచైతన్యమువల్లనుండి త్రిగుణాత్మకమైన పృథివిపుట్టెను. ఇటువలె పరస్పరాను ప్రవేశమువలన నీయపంచీకృత భూతపంచకము పుట్టెను.

శ్లో॥ భూమిరాపోనలోవాయుః ఖంమనోబుద్ధి రేవచ
అహంకారఇతీయంమే భిన్నాప్రకృతిరష్టధా॥

అని యున్నది గాన పృథివ్యాదులు మరియెనిమిది ప్రకారములుగ నుండును. కారణమయిన మాయత్రిగుణాత్మికముఁ గనుక కార్యములగు సూక్ష్మభూతములున్నూ త్రిగు

ణాత్మికములేను. ఈ భూతము లపంచీకృతములనియు పంచీకృతములనియు రెండువిధములుగ నుండును. అందపంచీకృత భూతములచే జ్ఞానేంద్రియోత్పత్తి చెప్పఁబడుచున్నది. ఆకాశవాయ్వగ్న్యుదక పృథివీ పంచకముయొక్క సత్వాంశములవలన క్రమముగ శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములను, నింద్రియములును, దిగ్వాయుసూర్యవరుణాశ్వినుల్లను నధిదేవతలును పుట్టెను. ఈ సూక్ష్మభూతపంచక సత్వాంశ సముదాయమువలన నంతఃకరణమధిదేవతా సమేతముగఁ బుట్టి వృత్తిభేదమువలన మనోబుద్ధి చిత్తాహంకారములని నాలుగు విధములయ్యెనని చెప్పుచున్నారు సంకల్ప వికల్పములనుఁ జేయునది బుద్ధివృత్తి, చింతించునది చిత్తవృత్తి, నేననెడిది యహంకారవృత్తి యివి సత్వాంశ సముదాయమువలనఁ బుట్టినవయినను ప్రాణికర్మ వాసనావాసితములుగాన త్రిగుణాత్మికములై యుండును వీటి యధిదేవతలను ముందర చెప్పుచున్నారు. కర్మేంద్రియోత్పత్తి యాకాశాదులవలనను రజోగుణాంశములవలనను క్రమముచేత వాక్పాణిపాదోపస్థగుదములున్ను, అగ్నీంద్ర విష్ణుప్రజాపతి మృత్యువులను నధిదేవతలున్ను పుట్టెను. సూక్ష్మభూతపంచక రజోగుణాంశ సముదాయమువలన అధిదైవములతోఁగూడ ప్రాణముపుట్టి అది క్రియాభేదముచే ప్రాణాపానవ్యానోదాన సమానములను నయిదు విధములయ్యెను, నాగకూర్మకృకరదేవదత్త ధనంజయములను నుపప్రాణము లయిదు ప్రాణములలోనే యంతర్భావములు యీ యాకాశాది గుణములఁ జెప్పుచున్నారు. సూక్ష్మాకాశమునకు శబ్దమొకక్కటియే గుణము, వాయువునకు శబ్దస్పర్శలు, అగ్నికి శబ్దస్పర్శరూపములు, అప్పునకు శబ్దస్పర్శరూపరసములు, పృథివికి శబ్దస్పర్శరూపరసగంధములు, యివి పంచీకృత భూతపంచక తన్మాత్రలు. జ్ఞానేంద్రియముల కివియే విషయములు. వచనాదానగమనవిసర్గానందములు కర్మేంద్రియ విషయములు, మనోబుద్ధ్యాదులకు విషయములు, సంకల్పనిశ్చయస్మరణాభిమానములుపంచకృతస్థితి.

శ్లో॥ పంచీకృత మహాభూతపంచకం కర్మసంచితం
శరీరంసుఖదుఃఖానాం భోగాయతనముచ్యతే॥

అన్నారు గనుకను సూక్ష్మభూతముల నొకటొకటి రెండుగా విభజించి యొకటి యటుండక కడమయర్ధాంశము నాల్గుగవిభజించి స్వాంశమున్విడచి మిలిగినవానిలో నొకటొకటి కలుపఁగా పంచీకృతమాయను. ఇటువలె పంచీకృతమయినభూతపంచకమువల్లను చరాచరాత్మకమయిన బ్రహ్మాండము చతుర్దశభువనాత్మకమై పుట్టెను. ఈ బ్రహ్మాండము సమష్టివ్యష్టులుగలదయ్యెను. జగంబంతయు సమష్టి, సమష్టిలో, నేకదేశమువ్యష్టి ఈవ్యష్టి త్రిశరీరాత్మకమై భౌతికరూపముగాఁ బరిణమించిన దానియం దవయవాకారముగాఁ బుట్టిన చతుర్దశకరణోపాధుల క్రమము.—ఆకాశాది పంచసూక్ష్మభూత తమోగుణాంశములవల్లను శ్రోత్రత్వక్చక్షురస నాఘ్రాణములకు నుపాధులయిన కర్ణస్థాలయష్టి

నేత్రగోళజిహ్వాగ్రనాసికములనే యుపాధిస్థలములు పుట్టెను, ఇక కర్మేంద్రియోపాధు లు చెప్పుచున్నారు.

ఈ సూక్ష్మభూతముల తమోధర్మమును పుచ్చుకొని జ్ఞానేంద్రియోపాధులనుం జె ప్పి మిగిలిన సగమునకు వినియోగమును చెప్పుచున్నారు, ఆకాశాది సూక్ష్మ భూతముల యొక్క శేషతమోంశమువలన వాక్పాణిపాదోపస్థపాయువులకు వక్త్రహస్తపాదగుహ్యగు దములు ఉపాధులయ్యెను; ఇదియును గాక మనోబుద్ధి చిత్తాహంకారములకు పంచసూక్ష్మ భూతతమోగుణ సముదాయమువలన హృదయముపుట్టి నాలుగువిధములుగా క్రమానహృద యముఖనాభికంఠ ప్రదేశములాయను; అయితే శరీరత్రయవిలక్షణము ఆత్మగనుక అనాత్మ యైన వీటికి ప్రయోజనము చెప్పుచున్నారు, స్థూలసూక్ష్మకారణ శరీరములైన వీటికి ఇం ద్రియాదులకు భోగస్థానముం గనుక సూలశరీరము కావలెను, దానికి సాధనమైన సూక్ష్మ శరీరమున్నూ కావలెను, ఈరెంటికిన్నీ కారణమైన కారణశరీరమున్నూ కావలెను, యీ సమస్తమునకున్ను అధిష్టానమే కారణంగనుక ఆ ఈశ్వరునివల్లనే జగత్తుఆయెను.

'యతోవా ఇమానిభూతాని జాయంతే, యేనజాతానిజీవంతి యత్ప్రయంత్యభిసం విశం' తీతి 'తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మేతి' అని తటస్థలక్షణశ్రుతి గనుక శబలబ్రహ్మమువల్ల నే జగత్తు ఆయెను; ఇందుకు సమష్టివ్యష్టులని బ్రహ్మాండపిండాంశములు భేదరూపముగ నుం డును గనుక ముందర వ్యష్టివిస్తారం నిరూపించుచున్నారు; మాతృపితృవిషయంవల్లనుండి న్నీ శుక్లశోణిత సమేతమై అన్నజన్యమై సకలప్రాణులకున్నూ నేను మనుష్యుడన నే యభిమానమునకు స్థానమై కరచరణాద్యవయవాకారంగల్గి స్థూలశరీరము దృశ్యముగ నుం డును. ఉపాసకులర్చిరాది మార్గమున సత్యలోక ప్రాప్తులవుచుండ[illegible]కర్ములు ధూ మ్రాదిమార్గానపోయి చాంద్రమసజ్యోతిరుపలక్షితమగు స్వర్గమునుపొంది అచ్చట నిష్టా పూర్త కర్మఫలము లనుభవించి ''క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి'' అన్నారు గనుక మగుడి పురుషునివల్లను-డి స్త్రీయందు జనియింతురు,

శ్లో॥ ధూమోరాత్రి స్తథాకృష్ణష్షణ్మాసా దక్షిణాయనంతత్ర చాంద్రమసంజ్యో తిర్యోగప్రాప్యనివర్తతే"తి శ్రీగీతాసు ''శ్రుతేధూమమభిసంభవంతి ధూమాద్రాత్రిః రా త్రేరపక్షీయమాణ పక్షమపక్షీయమాణ పక్షాద్యాన్ షణ్మాసాన్ దక్షిణాదిత్య ఏతి మాసేభ్యః పితృలోకం పితృలోకాచ్చంద్రంతే చంద్రం ప్రాప్యాన్నం భవంతితాస్తత దే వాయథాసోమరాజాన మాప్యాయస్వా పక్షీయస్వేత్యేవమేనా స్తత్రభక్షయంతి తేషాం యదాతత్పర్య వైత్యథేమమేవ ఆకాశమభినిష్పద్యంత ఆకాశాద్వాయుంవాయోర్వృష్టిం వృష్టేః పృథివీం ప్రాప్యాన్నం భవంతిపునః పురుషాగ్నౌహూయంతే తతోయోషాగ్నౌ తతోజాయంతే లోకాన్ ప్రత్యుత్థాయిక స్త ఏవమేవ అను పరివర్తంతే థయఏతా పం

ధానా నవిదు నే కీటాః పతంగాదయ ఇదందందశూక'' మితిజ్ఞానులకు ''అనావృత్తిశ్శబ్దా
త్ నపునరావర్తతే'' అన్నారు గనుక ముక్తిన్నీ కామ్యకర్మోపాసకులకు స్వర్గభోగా
నంతరమందు ఆవృత్తిన్నీ నిషిద్ధ కర్మవంతులకు నరకభోగానంతరమందు ఆవృత్తిన్నీ క్షు
ద్రకర్మవంతములయిన జంతువులకు అక్కడనేపుట్టుటలున్నూ చచ్చుటలున్నూ గాన నీలా
గుగా జనించిన శరీరమునకు ''పంచాత్మకం పంచసువర్తమానం పంచాశ్రయం షడ్గుణ
యోగయుక్తంతం సప్తధాతుం త్రిమలంత్రియోనిం చతుర్విధాహారమయం శరీరం'' అని
న్నీ ఇదిగాక పంచభూత గుణములను చెప్పుచున్నారు- పృథివ్యాదులకు క్రమమున ధా
రణ పిండీకరణరూపదర్శన వ్యాయామావకాశములున్నూ కఠిన ద్రవోష్ణ సంచరణ సుషీర
ములున్నూ గావుండును ఇవిగాక కొన్ని ప్రత్యేకించి చెప్పుచున్నారు- అస్థి, మాంస చర్మ
రోమ నాడులు భూసంబంధములు; శుక్లశోణిత మూత్ర, స్వేద, మజ్జలు ఉదక సంబంధ
ములు; క్షుత్పిపాసానిద్రామైథు నాలస్యములు అగ్ని సంబంధములు; త్రతార, తరణా,
రోహ, ఉత్థానాదులు వాయుసంబంధములు; కామ, క్రోధ, లోభ, మోహ లజ్జాదులు
నభస్సంబంధములు; అస్థి, స్నాయు, మజ్జలు పితృజన్యములు; త్వఙ్మాంసరుధిరములు మా
తృజన్యములు. రసంవలనశోణితం శోణితమువలనమాంసము, మాంసమువలన మేధస్సు, మె
దడువలన నస్థులు, అస్థులవలనమజ్జ, మజ్జవలనశుక్లం, శుక్లశోణిత సంయోగంవలనగర్భం ఒ
కరాత్రియందు కవిలం, ఏడురాత్రుల బుద్బుదం, పక్షమునకు పిండం, మాసమునకు కఠి
నం, రెండు మాసములకు శిరస్సు మూడుమాసములకు పాదములు, నాలుగుమాసములకుఅం
గుళజఠరకటిదేశములు, అయిదుమాసములకుపృష్ఠభుజములు, ఆరుమాసములకునాసాక్షిశ్రో
త్రములు, యేడుమాసములకు జీవప్రాప్తి, ఎనిమిదిమాసములకు సంపూర్ణమౌను. పితృరే
తోధికముచే పురుషుఁడౌను, మాతృశోణితాతిరేకముచే స్త్రీ యగును. సమత్వమయితే న
పుంసకుఁడగును; స్త్రీ పురుషులు వ్యాకులిత మనస్కులగుటచేత అంధపంగుకుబ్జులై జనిం
తురు. అన్యోన్యవాయుసంఘట్టనచే శుక్లము చెదిరెనేని కవలవారగుదురు తొమ్మిదవమా
సంబున సర్వలక్షణ పరిపూర్ణుఁడై పూర్వజాతి స్మరణఁజేయుచు తత్కాలజన్యములగు
సుఖదుఃఖముల ననుభవించుచు నుండును. అంతః ప్రసవవాయు ప్రేరితుఁడై జనించి వై
ష్ణవమాయాసక్తుఁడై పూర్వజాతిస్మరణయుంగక నుండును. జరాయుజాండజస్వేదజోద్భి
జ్జములను చతుర్విధ భూతగ్రామసృష్టులుఁగలవు నరాశ్వగజాదులు జరాయుజములు పక్షి
సర్పాదు లండజములు, మశకాదులు స్వేదజములు, వృక్షగుల్మాదులుద్భిజ్జములు ఇట్టి సృ
ష్టియందు అస్తిజాయతే వర్ధతే పరిణమతే అపక్షీయతే వినశ్యతే అను షడ్భావ వికార
ములతోఁగూడుకొని త్వఙ్మాంసరుధిర మేదోమజ్జాస్నాయ్వస్థులను సప్తధాతు సహితమై
జరామరణాదు లనెడి షడూర్మలతోఁగలసి అన్నమయకోశమై వాతపైత్యశ్లేష్మ భూయి
ష్టమై రోమనాడీ సమాయుక్తమై దంతసమేతమై అనేకనరములతోఁగూడుకొని నవద్వా

రయుక్తమై శరీరికి భోగసాధనమై స్థూలశరీరము పుట్టును. ఈశరీరమునకు క్రమముగ మూలాధారస్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధాజ్ఞాక షట్చక్రములును చతుష్షడ్దశ ద్వాదశషోడశ ద్విదళములు బీజన్యాసితములై స్వర్ణవిద్రుమపింగళ ధూమ్రమకర్పూర రత్నవర్ణములు గలుగునట్లుగా నుండును వీనికి గణపతి బ్రహ్మ విష్ణు రుద్ర జీవాత్మ పరమాత్మ లధిదేవతలు. ఇదియుఁగాక ఉపరిబ్రహ్మరంధ్రస్థానమందు గురుధ్యాన యోగ్యమై కర్ణికాసమేతమైన సహస్రారముండును. ఇటువంటి శరీరమునకు ఇళాపింగళ సుషుమ్నలు ముఖ్యనాడులు. జాగ్రదవస్థయందు అభిమాని విశ్వుఁడు ఇతనిని వ్యావహారికుఁడు చిదాభాసుఁడని యందురు అకారం మాతృక ఇక సూక్ష్మశరీరం చెప్పుచున్నారు.

“పంచప్రాణమనోబుద్ధి దశేంద్రియ సమన్వితం అపంచీకృత భూతోద్ధం సూక్ష్మాంగం భోగసాధనం” జ్ఞానేంద్రియ పంచకమున్ను కర్మేంద్రియ పంచకమున్ను ప్రాణాది పంచకమున్ను మనోబుద్ధులున్ను కలసి పదునేడవయవములు గల లింగ శరీరమందురు, వీటికిస్థానములు క్రియలు చెప్పుచున్నారు. కర్ణశష్కుల్యవచ్ఛిన్ననభోదేశము నాశ్రయించి ప్రాణికర్మానుగుణముగ స్వాధిష్ఠానదిగ్దేవతచేఁ బ్రేరేపఁబడ్డదై సకలశబ్దములను గ్రహించుచు సూక్ష్మమగు నొక్క వస్తువుండును దానిపేరు శ్రోత్రేంద్రియము, శ్రోత్రమధ్యాత్మము శబ్దమధిభూతము ఆపాదమస్తకపర్యంతముఁగాఁగల త్వక్కు నాశ్రయించి ప్రాణికర్మానుగుణముగ నధిదైవతమగు వాయుప్రేరితమై శీతోష్ణమృదుకాఠిన్యములను గ్రహించుచు సూక్ష్మమగు నొక్కవస్తువుండును దానిపేరు త్వగింద్రియము త్వక్కు అధ్యాత్మస్పర్శఅధిభూతము. కంటినల్లగ్రుడ్డు నాశ్రయించి ప్రాణికర్మానుగుణముగ సూర్యాధిష్ఠానదేవతాప్రేరితమై సకలరూపములనుఁ జూచుచు సూక్ష్మమగు నొకవస్తువుయుండును దానిపేరు చక్షురింద్రియము నేత్రమధ్యాత్మకనుట అధిభూతము నాలుకకొన నాశ్రయించి ప్రాణికర్మానుగుణముగ వరుణాధిష్ఠానదేవతాప్రేరితమై సకలరసగ్రాహియై సూక్ష్మమగు నొకవస్తువుయుండును దానిపేరు జిహ్వేంద్రియము, జిహ్వాఅధ్యాత్మ రసమధిభూతము నాశికాగ్రము నాశ్రయించి ప్రాణికర్మానుగుణముగ నశ్విన్యధిష్ఠానదేవతాప్రేరితమై గంధగ్రాహియగు నొక వస్తువుయుండును దాని పేరు ఘ్రాణేంద్రియము. నాసిక అధ్యాత్మ ఆఘ్రాణమధిభూతము కొననాలుక, అంగిలి, తాలువులు, తాలుమూలములు, ఉత్తరాధరోష్ఠములు ఈ అష్టస్థానముల నాశ్రయించి ప్రాణికర్మానుగుణముగ అగ్న్యధిష్ఠాన దేవతాప్రేరితమై సకల వాక్యములను పలుకుచు సూక్ష్మమగు నొక వస్తువుయుండును. దానిపేరు వాగింద్రియము. అది అధ్యాత్మ వచన మధిభూతము అరచేయి నాశ్రయించిప్రాణికర్మానుగుణముగ నధిదేవతయగు నింద్రదేవతాప్రేరితమై దానాదానములఁజేయుచు సూక్ష్మమగు నొక్కవస్తువుండును. దానిపేరు పాణీంద్రియము, పాణిఅధ్యాత్మ దానాదానమధి

భూతము అరికాలినాశ్రయించి ప్రాణికర్మానుగుణముగ నధిదేవతయగు విష్ణు ప్రేరితమై రాకపోకలు చేయుచు సూక్ష్మమగు నొకవస్తువుయుండును దానిపేరు పాదేంద్రియము పాదమధ్యాత్మ, గమనాగమన మధిభూతము గుహ్యమధ్యము నాశ్రయించి ప్రాణికర్మానుగుణముగ స్వాధిష్టానదేవతయగు ప్రజాపతి ప్రేరితమై యానందముఁజేయుచు సూక్ష్మమగు నొక వస్తువుయుండును. దానిపేరుపస్థేంద్రియము, గుహ్యమధ్యాత్మ ఆనందమధిభూతము గుదమధ్యము నాశ్రయించి ప్రాణికర్మానుగుణముగ నధిదేవతయగు మృత్యు ప్రేరితమై మలవిసర్జనము చేయుచు సూక్ష్మమగు నొకవస్తువుయుండును దానిపేరు పాయ్వింద్రియము గుదమధ్యాత్మ విసర్జన మధిభూతము హృదయము నాశ్రయించి ప్రాణికర్మాను గుణముగ స్వాధిష్టాన దేవతయగు విష్ణు ప్రేరితమై శ్వాసోచ్ఛ్వాసములఁజేయుచు సూక్ష్మమగు నొకవస్తువుయుండును. దాని పేరు ప్రాణము. గుదమధ్యము నాశ్రయించి స్వాధిష్టానదేవతయైన విశ్వకర్మ ప్రేరితమై నిశ్వాసక్రియలఁజేయుచు సూక్ష్మమగు నొక వస్తువుయుండును, దానిపేరపానము. నాభినాశ్రయించి ప్రాణి కర్మానుగుణముగ స్వాధిష్టానదేవతయగు విశ్వయోని ప్రేరితయై జఠరాగ్నిఁగూడుకొని అశనపానాదికము మూడు విధములుగ భాగించి ఒక భాగము మలమునకును ఒక భాగము మాంసమునకు మిగిలిభాగము మనస్సునకు యిచ్చుచు జలమున్ను ఆలాగే స్థూల, మధ్యమ, సూక్ష్ములయిన ప్రథమద్వితీయతృతీయాంశములు మూత్రరక్త ప్రాణములకిచ్చుచు ఘృతమున్ను ఆలాగే స్థూలమధ్యమసూక్ష్ములయిన ప్రథమ ద్వితీయ తృతీయాంశములు క్రమమున అస్థిమజ్జాత్వక్కులకు యిచ్చుచు సూక్ష్మమై యొకవస్తువుయుండును, దానిపేరు సమానము. కంఠము నాశ్రయించి ప్రాణికర్మానుగుణముగ నధిష్టానదేవతయగు నజునిచేఁ బ్రేరేపింపఁబడినదై సుషుప్తికాలమందు సకలేంద్రియములను తనయందు లీనముఁజేసికొని జాగ్రత్స్వప్నావస్థానముల నాయాయింద్రియముల నిలుపుకొనుచు నిర్యాణకాలమందు సకలేంద్రియ ప్రాణాదులనుఁ దివుచుకొని జీవునికన్న మున్ను తాను సారథియై పరలోకమునకుఁబోవు సూక్ష్మమగు నొక్క వస్తువుయుండును, దానిపేరు దానవాయువందురు. ఆపాదమస్తక పర్యంతం సకల శరీరములను వ్యాపించి అన్నరసముచేత శరీరములకుఁ బుష్టినిచ్చుచు ప్రాణి కర్మానుగుణముగ నధిష్టానదేవతయగు విశ్వజయునిచె ప్రేరేపించఁబడినదై సూక్ష్మమగు నొకవస్తువుయుండును; దానిని వ్యానవాయువందురు.

శ్లో॥ హృది ప్రాణో గుదేపాన స్సమానో నాభిసంస్థితః। ఉదానః కంఠదేశస్థో వ్యానస్సర్వ శరీరగః॥ అనిచెప్పియున్నందునను వీటియందతర్భూతములయిన యుపప్రాణములకు వినియోగంచెప్పుచున్నారు.

శ్లో॥ ఉద్గారేనాగఆఖ్యాతః కూర్మఉన్మీలనేస్మృతః కృకరస్తుక్షుతేజ్ఞేయో దేవ

దహ్యోవిజృంభణే నజహాతిమృతంవాపి సర్వవ్యాపీ ధనంజయః'' వీటిప్రయోజనములు స్పష్టము. హృదయము నాశ్రయించి ప్రాణి కర్మానుగుణముగ నధిదేవతయగు బృహస్పతిప్రేరితమై సంకల్పవికల్పములఁజేయు నొకసూక్ష్మవస్తువయుండును. దానిపేరు మనస్సు. ముఖము నాశ్రయించి ప్రాణి కర్మానుగుణముగ నధిదేవతయగు బృహస్పతిప్రేరితమై నిశ్చయముఁజేయు నొకసూక్ష్మవస్తువయుండును. దానిపేరు బుద్ధి. నాభి నాశ్రయించి ప్రాణి కర్మానుగుణముగ క్షేత్రజ్ఞాధిదేవతాప్రేరితమై యతీతానాగత వ్యవహారముల నాలోచించు నొక సూక్ష్మవస్తువయుండును. దానిపేరు చిత్తము. కంఠము నాశ్రయించి ప్రాణి కర్మానుగుణముగ రుద్రాధిదేవతాప్రేరితమై యభిమానముఁజేయు నొకసూక్ష్మమగు నొక వస్తువయుండును. దానిపే రహంకారము, ఈచిత్తాహంకారములు మనోబుద్ధులలోనివి. గాన నీ పదియేడింటితోఁ గూడినది లింగశరీరము.

క్షుత్పిపాసలు ప్రాణధర్మములు. శోకమోహములు మనోధర్మములు. జరామరణములు వెనుకఁజెప్పిన స్థూలశరీరధర్మములు. అన్నమయకోశము స్థూలశరీరము. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశములు నింతవట్టున్న సూక్ష్మశరీరము. దీనికి స్వప్నమవస్థ. అభిమాని తైజసుఁడు. యితనిని ప్రాతిభాసికుఁడు స్వప్నకల్పితుఁడు అందురు. ఉకారంమాత్రక ఈస్థూలసూక్ష్మవ్యష్టిశరీరములకు కారణమయిన కారణశరీరమునుఁ జెప్పుచున్నారు.

అజ్ఞానము మాయాప్రకృతిప్రధానం అవిద్యాకారణం తమస్సు యివి మొదలగు భేదములు కారణమునకే చెప్పుదురు.

"శ్లో॥ అనాద్యవిద్యా నిర్వాచ్యా కారణోపాధిరుచ్యతే॥" గనుక ఈ కారణశరీరము ప్రాణియొక్క పూర్వజన్మసంస్కారవాసనావాసితము, కాగా తత్కార్యమైన అంతఃకరణముగూడ తద్వాసనావాసితమే. ఇది స్థూలసూక్ష్మశరీరములను వ్యాపించి ఆత్మస్వరూపావరకమై ఆత్మయం దనాత్మాభిమానమును అనాత్మయం దాత్మాభిమానమును జీవునియందుకల్పించి తత్కల్పితాభిమానమువలన వచ్చిన అనాదియగు నీ సంసారమునకు కారణమైయుండును. ఆజీవుని సుకృతవిశేషముచేతను గురూపదిష్ట వేదాంతవాక్యజన్యమయిన స్వాత్మద్వయజ్ఞానముచే బాధింపఁబడిపోవును. సుషుప్త్యవస్థ అభిమాని ప్రాజ్ఞుఁడు ఇతని నే పారమార్థికుఁడును నవచ్ఛిన్నుఁడును అందురు.

"శ్లో॥ బహిఃప్రజ్ఞోవిభుర్విశ్వో హ్యంతఃప్రజ్ఞస్తు తైజసః। ఘనప్రజ్ఞస్తథాప్రాజ్ఞో ఏకఏవత్రిధాస్మృతః॥" అన్నారుగనుకను సకలేంద్రియము లహంకారముతోఁగూడ

కారణమగు తమస్సునందు లయించినందున ప్రత్యగాత్మ ఆనందరూపముచేతనుండి సుషుప్త్యవస్థానమందు తదానందసాక్షియై యుండుటచే దీనియం దానందమయకోశముండును. ఆసుషుప్తియందు పాధియైన యంతఃకరణము ముకుళితమైయుండ ప్రతిబింబము తోచక యుండును. ఇది యైక్యమనరాదాయని పునరుద్థానమున్నదిగనుక అనఁగూడదు. ఈ శరీరత్రయమునకు వివరముఁ జెప్పుచున్నారు.

జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, అంతఃకరణాదిపంచకము, శబ్దాదిపంచకము, పృధివ్యాదిపంచకము ఈ యిరువదియైదింటికి స్థానమయిన స్థూలశరీరము. జాగ్రదవస్థ, స్థానము, నేత్రము, రయుక్తము, భోగము, క్రియాశక్తి విశ్వుఁడభిమాని. అకారముమాతృక. గుణము రాజసము. ఆత్మ వ్యావహారికజీవుఁడు అదియే జీవాత్మ. ఈయింతవట్టున్నా స్థూలశరీరము. ఇంద్రియదశకము. ప్రాణాదులు, అంతఃకరణాదులు, శబ్దాదులు, అజ్ఞానకామ్యకర్మములు. ఇవి అష్టపురములందురు. దీనికి స్వప్నమవస్థ. స్థానము, కంఠము ఇచ్ఛాశక్తి తైజసుఁడభిమాని. సాత్వికగుణము. ఉకారం మాతృక. స్వేచ్ఛాభోగము, వ్యాపకాత్మ అంతరాత్మ అతఁడే ప్రాతిభాసికుఁడు. ఈయింతవట్టు లింగశరీరము, కారణశరీరస్థితి. వటబీజమందు వృక్షముంబలె సకలేంద్రియములును వాసనాత్మకముఁగా సుషుప్తికాలమున మోహాతమస్సునందుఁ బ్రవేశించియుండును. అవస్థ సుషుప్తి హృదయనివాసం. ప్రాజ్ఞుఁడభిమాని. ద్రవ్యముశక్తి. తామసగుణం. మకారం మాతృక. వ్యాపకాత్మ పరమాత్మ. అతఁడే పారమార్థికుఁడు. భోగము ఆనందము. ఈ యింతవట్టున్నా కారణశరీరము. ఈలాగున సంక్షేపముగ వ్యష్టిశరీరత్రయనిరూపణఁ జేసి దీనికిసమ్మతి శ్రుతి విస్తరభయముచే వ్రాయలేదు. అపోహింతోచెనా గర్భోపనిషత్తు, శారీరోపనిషత్తు, ఛాందోగ్యషట్కం, ఐతరేయాత్మషట్కం మొదలయినవి విచారించి చూచునది.

ఇకను సమష్టితనుత్రయలక్షణము చెప్పుచున్నారు.

పృధివ్యప్తేజోవాయురాకాశ చంద్రసూర్యాత్మలను అష్టమూర్తులీశ్వరుని విరాడ్రూపమయిన స్థూలశరీరము. ఉత్పత్త్యవస్థ. అభిమాని బ్రహ్మ. ఇతనినే విరాట్టు వైశ్వానరుఁడు, వైరాజుఁడు నందురు. క్రియాశక్తి రజోగుణం అహంకారము సూర్యస్థానము సర్వకర్తృత్వము భోగము. అకారము మాతృక. వీటివ్యాపకాత్మ భూతాత్మ ఈయింతవట్టుగలవాఁడు విరాట్పురుషుఁడు. ఇక సకలభూతాశ్రయమైన హిరణ్యగర్భశరీరమును జెప్పుచున్నారు.

దశదిక్కులు, శ్రోత్రములు, వాయువు, త్వక్కు, సూర్యుఁడు, చక్షువు, వరుణుఁడు, జిహ్వ, అశ్వినీదేవతలు, ఘ్రాణము, వహ్నివాక్కు. ఇంద్రుఁడుప్రాణి. ఉపేంద్రుడు పాణి. బ్రహ్మ ఉపస్థ. వాయువు మృత్యువు. జ్ఞాత అంతఃకరణము. మనస్సు చంద్రుఁడు బుద్ధి బృహస్పతి క్షేత్రజ్ఞుండు చిత్తము. రుద్రుఁడు అహంకారము. ఈ దేవతలతోఁగూడినదే హిరణ్యగర్భశరీరము. అటుగనుకనే వ్యష్టిశరీరమందలి కరణములకు నధిదేవతలు సమష్టితో వ్యష్టి అంతర్భాగముగనుక ఏగోళకమెచ్చటనున్న నాయధిదైవము తానే యచ్చటనున్నది విచారించుకనేది. ఇందుకవస్థస్థితి. విష్ణువభిమాని. ఇతనిని హిరణ్యగర్భ సూత్రాత్మ ప్రాణులనుఁగాఁ జెప్పుదురు. ఇచ్ఛాశక్తి సాత్వికాహంకారము చంద్రస్థానము సర్వపాలకత్వము భోగము. ఉకారం మాతృక. వీనివ్యాపకాత్మ సూత్రాత్మ ఇదియంతయు హిరణ్యగర్భశరీరము. ఈవిరాడ్ఢిరణ్యగర్భులకు కారణమైనది కారణము. బైందవస్వరూపముగు నవ్యాకృతశరీరము. అవస్థప్రళయము. రుద్రుఁడభిమాని. ఇతని నంతర్యామ్యవ్యాకృత జగత్స్రష్టలందురు. ద్రవ్యశక్తి, తామసాహంకారము, అగ్నిస్థానము, సంహారము భోగము. మాతృక మకారము. వీటితోఁగూడిన వ్యాపకాత్మ శుద్ధాత్మ, ఇంతవరకు సమష్టి కారణశరీరము. ఈజీవేశ్వర శరీరషట్కము. వ్యాచ్యార్థము. ఇఁతయు నశ్వరము దృశ్యము వీటికిసాక్షి చిత్తు. ఈయారింటితో మిథ్యాతాదాత్మ్యంగలదై యజ్ఞానోపాధిచే శబలబ్రహ్మ మనిపించుకొనును. వీని కతీతంబైనదే తుర్యావస్థయందలి శుద్ధచైతన్యం అదియే ప్రణవాంతమందలి అర్ధమాత్రకు ప్రతీతంబయిన నిత్యముక్త శుద్ధ బుద్ధ సత్య జ్ఞాన సచ్చిదానందపరిపూర్ణమయిన నిష్కళబ్రహ్మము. ఇవ్విధంబుగ పిండాండ బ్రహ్మాండస్థ భూతేంద్రియ దేవతాసృష్టిరూపమయిన త్రిసర్గమును వివరించి ఆత్మస్వరూపమును సూచించి అకారోకార మకారాత్మకమగు ప్రణవప్రతిపాద్యము ప్రపంచముఁగను పయిఅర్ధమాత్రక చిత్ప్రతీతిఁగనుఁ జెప్పినందులకు శ్రుతులు

"ఓమితిబ్రహ్మ ఓమితీదగ్ంసర్వం ఓంతద్బ్రహ్మ ఓంతద్వాయుః ఓంతదాత్మా"

"శ్లో॥ ఓమిత్యేకాక్షరంబ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్॥"

కావున ఉచ్చారణ విరామములయందు ప్రతిపాద్యములగు ప్రపంచబ్రహ్మస్వరూపముల విచారించుకొని సుఖముగ ప్రణవధ్యానమొనర్చుచు నహంకారాభిసంధినివిడచి తూష్ణీంభావముచే ప్రపంచమునందు విరాగుఁడై విషయముల నుపరమించియుండవలెను. ఆకాలంబున మనస్సు గురూపదేశముచే నావరకం బాసినపిదప స్వరూపాపరోక్షమైతే వృత్తి తదాకారమై కర్పూరదీపికాన్యాయముచే నుండును. ఇదియే జీవన్ముక్తి. ఆహార వ్యవహారములకు పరాక్ప్రవణమైనఁగాని దగ్ధపటమువలెనే జీవన్ముక్తికి హానికాదు. ఈ

లాగుగా ప్రారబ్ధక్షపణపర్యంతమున్ను జాగ్రత్తియందు సంకల్పమున్ను సుషుప్తియందు దృష్టిప్రపంచ ప్రతిఫలితమనోవృత్తియే స్వప్నముగనుక స్వప్నములేకయున్నను దేహాక్షితియందు విదేహకైవల్యమునుఁబొందును.

శ్రు॥ "నాన్యఃపంథా విద్యతేయనాయ" ఈలాగున ముక్తినిసూచించి ఇక ప్రణవమందు విషయమునుఁ జెప్పుచున్నారు.

శ్లో॥ "పంచీకృతమహాభూతసంభవం కర్మసంచితం
శరీరంసుఖదుఃఖానాం భోగాయతనముచ్యతే॥"

ఇట్టి అన్నమయకోశవ్యష్టి స్థూలశరీరమువలనఁ దదభిమానియగు విశ్వుఁడు సమష్ట్యుపాధికుఁడగు విరాట్టుతోఁగూడి జాగ్రదవస్థవలన నపంచీకృతమై ఉకారస్వరూపమయిన సూక్ష్మశరీరమం దధిదైవయుక్తముగను విలయము ప్రాణమయ మనోమయ విజ్ఞానమయములయిన మూడుకోశములతోఁగూడిన సూక్ష్మశరీరమువల్లనుండి తదభిమానియైన తైజసుఁడు తనతోఁగలుసుకున్న విశ్వునితోఁగూడా సమష్టిసూక్ష్మశరీరోపాధికుఁడయిన హిరణ్యగర్భుఁడు విరాట్టుతో తనను గలుసుకున్నవాఁడు గనుక నాస్వప్నావస్థనుండి అధిదైవయుక్తముగాను మకారమందు లయముఁబొందును. సుషుప్త్యవస్థయగు మకారమందు తదభిమానియైన ప్రాజ్ఞుఁడు సమష్టికారణశరీరోపాధికుఁడైన యవ్యాకృతునిఁ గలసుకొని మునుపుచెప్పిన విశ్వతైజసులును విరాడ్ఢిరణ్యగర్భులును తననుఁ గలసికొనిరి గాన ఇంతవట్టున్ను "సర్వవిషయజ్ఞానాభావా త్సుషుప్తిః" గనుక నాసుషుప్తియందు ఆనందమయకోశమందానందసాక్షియైయుండును. ఇంతవట్టున్ను అయిన త్రిమాత్రలయందలి ప్రపంచమునకు సాక్షియైన ప్రత్యక్కు మోక్షేచ్ఛఁగలవాఁడు గాన సంస్కారము వాసనాసహితమై నిర్మూలమయినందున తుర్యావస్థయం దర్ధమాత్రోపలక్షితమై ప్రణవవిరామమయిన బ్రహ్మభావముబొందును. ఇదియే ప్రత్యగభిన్న బ్రహ్మభావానుసంధానము. ఈచెప్పివచ్చిన చతుర్విధావస్థాస్వరూపము విస్తరముగ వివరింపుచున్నారు.

ఇంద్రియములు విషయములనుఁ బొందుటవల్ల వచ్చిన జ్ఞానము జాగ్రత్తి. జాగరితసంస్కారజ ప్రత్యయము సవిషయమై స్వప్నము. జాగ్రతయందు వికశితమయిన అంతఃకరణము స్వప్నావస్థయం దర్ధముకుళితమై యుండేఁగాన జాగ్రతయందలి దృష్టప్రపంచము ప్రతిఫలించుటయే స్వప్నావస్థ. సుషుప్త్యవస్థయనంగా అంతఃకరణము ముకుళితమై యుండెనుగనుక సర్వవిషయజ్ఞానాభావమేను. తురీయావస్థ ఆనందరూపమయిన తనను తాఁ దెలిసి వస్తుగోచరమగు వృత్తి నశించి సాక్ష్యములేకయుండి తన్ను మరచి యుఁడఁగకయుండుటేను. మునుపుచెప్పిన ప్రత్యక్స్వరూపమును విస్తరించుచున్నారు.

మండలత్రయయుక్తమయిన దహరాభానుడు ప్రత్యక్షు "యశ్చాసావాదిత్యే పీక్షత ఆత్మాంతర్యామ్యమృతమయః ప్రాణిషు హృదంతర్జ్యోతిఃపురుషః యోయందక్షిణేక్షిణిపురుషః" ఈలాగు శ్రుతులు చెప్పునుగనుకను యోగమతమున్నూ రాజయోగమునందమనస్కుమై ప్రతిబింబమునకు బింబమందు సుషుప్తియందుంబలెనే ఐక్యముగాన "యోగశ్చిత్తవృత్తినిరోధః" అని పతంజలిసూత్రమున్నది గనుక వృత్తినిరోధకాలమందాజ్ఞా చక్రమధ్య దహరాకాశ సుషుమ్నాంతర్వర్తియైన ప్రత్యక్కుతురీయమందు ప్రపంచాతీతమై యభిన్న బ్రహ్మభావమయిన పరశివస్వరూపమవును. "ప్రపంచోపశమం శివమద్వైతం" అని యున్నదిగనుకను ఇటువలె స్వరూపమును నిరూపించి అదియే నీవని తత్వమస్యాది మహావాక్యములచేతను జహదజహల్లక్షణచేతను స్వరూప నిరూపణజన్యమయిన ప్రతిబద్ధ సాక్షాదపరోక్షజ్ఞానము సంశయాసంభావనా విపరీతభావనారహితమగునటుల వివరించందలంచి ముంద తన్నిరూపణపూర్వముగ నాత్మస్వరూపమయిన సచ్చిదానందస్వరూపమును వివరింపుచున్నారు.

అనృతజడ దుఃఖాత్మకమయిన శరీరత్రయమున్నూ అనాత్మయేను, యెటులనంటే యుక్తి చెప్పుచున్నారు స్థూలశరీరము దృశ్యమై బుద్బుదమువలె నశ్వరమై పోవును గనుకను ఘటమువలె జడముగనుకను సకలదుఃఖములకు నాలయమయినది గనుక ననృతజడదుఃఖాత్మకము. అటులనే సూక్ష్మశరీరము ఆయా యీ యవయవములకు తత్తద్వ్యాపారముగలది సూక్ష్మశరీరమని తెలియఁబడును గనుక దృశ్యమున్నూ ముముక్షువుచే స్వరూప మెఱుఁగబడుటవల్లను అజ్ఞప్తిచేత నజ్ఞాననివృత్తి యగుటవల్లను తత్కార్యమయిన సూక్ష్మశరీరము బాధింపబడుచున్నది గనుక వస్త్వంతరము నుపజీవింపఁజేసి వ్యవహరించును గనుక నావ్యవహారమువల్ల దుఃఖమే తోచునుగాన ననృతజడదుఃఖాత్మకమేను అటులనే కారణశరీరమునకును జెప్పుచున్నారు. ముముక్షువుచే స్వాత్మాద్వయజ్ఞానమువలన బాధింపఁబడిపోవుచున్నదిగనుకను ఆత్మవస్తువు నపేక్షించిగాని దగత్కల్పన కూడదుగనుకను సకలదుఃఖరాశికి కారణముగనుకను అనృతజడదుఃఖాత్మకమేను. అటుగనుక శరీరత్రయవిలక్షణ మాత్మయని చెప్పఁబడును. అటులైతే స్వరూప మేదనిన చెప్పుచున్నారు.

సచ్చిదానందములే స్వరూపము సత్తనగను "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ అహమేవాసమేవాగ్రే" అని ప్రమాణములు గలవు. మరిన్ని యుక్తిఁజెప్పుచున్నారు.

త్రికాలములయం దఖండముగ నున్నందులకు లోకపరీవాధ మేము పూర్వజన్మములయం దేమి సుకృతదుష్కృతముల చేసితిమో? వాటికి ఫలమయిన సుఖదుఃఖముల

ననుభవించుచుంటిమనియు నిప్పుడొకరికి పెట్టినవారముగాము. ఇక జన్మాంతరమందును దరిద్రులమై పుట్టగలవారమని కాలత్రయాబాధ్యమై తోచును గాన సద్రూపము సిద్ధించెను. చిద్రూపమయినందుకు ప్రమాణము.

"అత్రాయం పురుషస్స్వయం జ్యోతిః ధామ్నా స్వేన సదానిరస్తకుహకం। స్వాజ్ఞానకల్పిత జగత్పరమేశ్వరత్వ జీవత్వభేద కలుషీకృత భూమభావా। స్వాభావిక స్వమహిమాస్థితిరస్త మోహాప్రత్యక్చితి ర్విజయతే భువనైకయోనిః॥"

ఈలాగుగా శ్రుతిస్మృతులుగలవు. మరిన్నీ యుక్తిచెప్పుచున్నారు

సాధనాంతరానపేక్షితమై తానుప్రకాశింపుచు నితరపదార్థములను ప్రకాశింపజేయునుగనుక చిద్రూపముసిద్ధించెను. ఇందులకు దృష్టాంతరము. చమురుతోఁగూడిన ప్రమిదెయందలి వత్తియను నుపాధిసహితమై దీపము తన స్వప్రకాశమందు ప్రకాశాంతరము నపేక్షించక తానుతోచుచు సన్నిహితములగు పదార్థములను తోఁపింపజేయుచుండును. దార్ష్టాంతికమందున చిత్తున్నా దేహమనే ప్రమిదయందు ఇంద్రియప్రాణాదికములను చమురుతోఁగూడిన బుద్ధియను శక్తితోఁ గూడుకున్నదై స్వప్రకాశమందు ప్రకాశాంతరము నపేక్షింపక తానను సాక్షిరూపముచేఁ బ్రకాశించుఁ దనయందధ్యస్తములయిన ఇంద్రియములనుఁ బ్రకాశింపఁజేయుచు నుండును. మరియు నొక్కటి జెప్పుచున్నారు. వెనుకఁ దనచేవ్యవహరింపఁబడిన వ్యవహారము బుద్ధ్యుపాధిసహితమై యరుగుచుండునుగనుకను అంధకారమందున్నను సూర్య చంద్ర నక్షత్రాగ్ని చక్షురాది ప్రకాశానపేక్షితమై గతములగు సకలవ్యవహారములను బుద్ధియుక్తుఁడగుచునచేఁ జెలియఁగఁబడుచున్నదిగనుకను ఆత్మకు చిద్రూపము సిద్ధించెను. ఆనందస్వరూపమును జెప్పుచున్నారు.

"నవా అరే సర్వస్యకామాయ సర్వంప్రియం భవంత్యాత్మనస్తుకామాయ సర్వం ప్రియంభవతి రసోవైసః రసగ్ంహ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" అని శ్రుతులున్నవి గనుకను మఱి యుక్త్యనుభవములచేఁ జెప్పుచున్నారు. నిరుపమ నిరవధిక నిరతిశయ సుఖమానందము. ఇదికలదా? యనిన లోకంబునఁ బురుషులకు స్రక్చందన వనితాదులవలన నొక యానందముఁబుట్టును. దుఃఖరూపములగు దేహాదికములయందు లేదుగాన నది యాత్మయొక్క స్వరూపానందము. ఆయావృత్తులయం దభివ్యక్తమై యుండును. మరియు గాఢనిద్రఁబోయిన పురుషుఁడు మేల్కని ఇంతదనుక సుఖముగ నుంటినని తలచుకొనుచున్నాఁడు గాన సకలప్రాణులయందు నిరతిశయానందముఁ గలదు. అందుచేత నాత్మకానందరూపము సిద్ధమయ్యెను.

"ప్రత్యగ్భోధోయ ఆభాతిసోద్వయానందలక్షణః అద్వయానందరూపశ్చ ప్రత్యగ్బోధైకలక్షణః" అని ప్రత్యగభిన్న బ్రహ్మస్వరూపానందమును నిరూపించి శరీరత్రయవిలక్షణత్వము సచ్చిదానందత్వము నాత్మకు సిద్ధమనిరి. ఆత్మశుద్ధస్వరూపుఁడయిన నాయారూపములుఁ గలవాఁడై యేలచూడఁబడుచున్న వాఁడనిన నిర్మలమగు స్ఫటికము నీలపీతాదులగువానితో సంబంధముగలదై ఆయారూపములవలె తోచినట్లే! ఆత్మయును ఇంద్రియములతో కల్పితమగుసంబంధముచే నాయారూపములుఁ గలదివలె నజ్ఞులచే చూడఁబడుచున్నది. అటులైన నిట్టియాత్మ నెటుల తెలిసికొనవలెననిన పొట్టుతోఁగూడిన ధాన్యమునందు పొట్టునుఁద్రోసివైచి బియ్యమును గ్రహించినవిధంబున దేహేంద్రియములతో మిథ్యాసంగముఁగల యాత్మను నేతినేతివాక్యములచేతను "నాహం దేహో నేంద్రియాణ్యంతరంగో నాహంకారః ప్రాణివర్గో నబుద్ధిః" అను చాటూక్తిచేతను సకలవస్తువులకు నాంతరమైయున్నటుల గురువులచేఁ దెలిసికొని విచారించి యెఱుఁగవలెను.

ఓయీ! ఆత్మపరిపూర్ణుఁడైన నంతటను ఏలతోచదంటివేని అంతఃకరణము లంతటా లేవుగాన ప్రతిబింబితుఁడై తోపఁడు దర్పణాదికములందు ప్రతిబింబములవలెను ఉన్నదిక్కున తోచును. గాన దేశ కాల వస్తు పరిచ్ఛేదశూన్యమయిన యాత్మ తానని గురువులు తెలుపవలసినమర్మముఁ దెలుపఁగాఁ దెలిసి సుఖముగ నుండవలెను. అటులైనఁ దానాత్మయైయున్నప్పుడు తెలుపఁబడినకారణ మేమి, యెందువలన తెలియదంటివా కంఠగతచామీకరము అజ్ఞానముచేఁ దెలియకపోయినను చూచినవారు తెలుపఁగా నుండఁ జూచుకొనినవిధంబుగ శ్రీగురువు లనుగ్రహించి తెలుపఁగా తెలుసుకొనవలెను. ఓయీ వ్యాపారరహితమగు నాత్మ వ్యాపారివలె చూడఁబడుచున్నాఁడేయనిన చంద్రుఁడు మేఘాచ్ఛాదితుఁడై వానివేగముచే తానును నడిచినవిధంబునఁ గనఁబడిన ట్లింద్రియములు విషయములయందుఁ బ్రవర్తించిన నాసంబంధ మజ్ఞారోపితమేఁగాని తానైతే నేమియు స్పృశింపదు. బుద్ధియందున ప్రతిఫలించుటచేతను కన్నై కనినట్లు చెవియై వినినయట్లు జిహ్వయై రుచిఁగొనినట్లు ఘ్రాణమై మూర్కొనినవిధంబుగ తనువై స్పర్శముఁగొనినరీతి యుండును. ఓయీ! కర్తృత్వము జడములగు మనోబుద్ధ్యాదులదియగునా? నిర్వికారియగు నాత్మ దగునా? అని శంకరాగా చెప్పుచున్నారు.

"నాన్యంగుణేభ్యః కర్తారం యదాద్రష్టానుపశ్యతి। గుణేభ్యశ్చపరం వేత్తి మద్భావం సోధిగచ్ఛతి॥" అని శ్రీమద్భగవద్గీతయం దున్నదిగాన గుణవ్యతిరిక్తమగు నాత్మయందు కర్తృత్వంలేకయుండు సిద్ధమయ్యెను. కర్తృత్వము గుణములదేనా? యనిన "కార్యకారణకర్తృత్వే హేతుఃప్రకృతిరుచ్యతే అధిష్టానంతథాకర్తా కరణంచ పృథగ్వి

థం। వివిధాశ్చపృథక్చేష్టా దైవంచైవాత్రపంచమం" అనియున్నందున పురుష సన్నిధానమువలన దేహేంద్రియాదులకే కర్తృత్వముఁ జెప్పవలెను. "పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే" అనియున్నదిగదా? పురుషునకును భోక్తృత్వహేతుత్వముఁ జెప్పవలసినదేనా యని శంకరాగా పురుషుఁడనఁగా నిక్కడ క్షేత్రజ్ఞుండు క్షేత్రజ్ఞుఁడనఁగా ప్రత్యగాత్మయంటిరా? కాదు. ప్రత్యగాత్మయనఁగా దేహేంద్రియాది వ్యాపారమనులోమముచేఁ జూడక ప్రతిలోమముచే స్వరూపమును విచారించుచు నిష్క్రియాభావముచే నభిన్నబ్రహ్మభావమునుఁ బొందువాఁడు క్షేత్రజ్ఞుఁడైతే దేహాభిమానముచేతనుండే చిజ్జడగ్రంధియగు జీవుఁడు ఇతనికి సుఖదుఃఖభోక్తృత్వ హేతుత్వము తత్సంవేదనమును చెప్పేది.

ప్రకృతిసంవిధాన మున్నందునను ఆసంవేదన మాత్మదగుటచేతను "ప్రకృతిస్థోహి భుంక్తే ప్రకృతిజాన్గుణాన్" అన్నందువలనను సంవేదనము చెప్పవలెను. ఓయీ! సచ్చిదానందస్వరూపునికి దుఃఖ మేలాగువచ్చుననిన శరీరమువల్ల శరీరకర్మమువల్లను కర్మరాగమువల్లను రాగమభిమానమువల్లను అభిమాన మవివేకమువల్లను అవివేక మజ్ఞానమువల్లను వచ్చును. ఆయజ్ఞాన మనాదియైన యవిద్యయనఁబడును. "అనాద్యవిద్యానిర్వాచ్యా చాత్మసంచాశితాపురా" అన్నారుగాన దానికి నాశనమేలాగనిన అహంబ్రహ్మాస్మి అనే వివేకముననే? అజ్ఞానముపోవును. అజ్ఞానముపోగనే యవివేకముఁబోవును. అవివేకము పోయినతోడనే యభిమానముపోవును. అది నశించఁగా రాగమునశించును. రాగమునశించినంతనే కర్మమునశించును– కర్మమునశించినంతనే శరీరములేకపోవును– శరీరము లేకపోయినందున దుఃఖములేకపోవును– దుఃఖము లేకపోగానే అఖండానందస్వరూపముతోనుండును– ఓయీ! జడములగు దేహేంద్రియములకు వ్యాపార మెటులనంటివేని సూర్యప్రకాశము నాశ్రయించి ప్రాణులు తమతమవ్యాపారములం జేయుచుండినట్లు చైతన్యము నాశ్రయించి దేహేంద్రియాదులు వ్యవహరించును

"ఆత్మచైతన్యమాశ్రిత్య దేహేంద్రియమనోధియః స్వకీయార్థేషువర్తంతే సూర్యాలోకం యథాజనాః" అని యాచార్యులస్వామిసూక్తియున్నది. అయితే ఆత్మ నిర్వ్యాపారిగాన సుఖదుఃఖములమాత్రమయిన నంటివా అహంకర్తా సుఖీదుఃఖీ అని ప్రత్యగాత్మకు అనుభవము మాడఁబడుచుండఁగా నైటులలేదనేవంటివా నిమ్మలమగు నాకాశమందునీలపీతాదు లెటుల కల్పితములై లేకయున్నను చూడఁబడుచున్నదో అటువలెనే ప్రత్యగాత్మయందున్నూ ఆభాసతోఁగూడిన బుద్ధీంద్రియదోషములు ప్రతిబింబద్వారా అధ్యస్తమై యజ్ఞులచేఁజూడఁబడును. వాస్తవమునకులేవు. జలప్రతిబింబితుఁడగు చంద్రునియందుదకచలనాదికము ప్రతిబింబద్వారా కల్పింపఁబడినటుల బుద్ధియందు ప్రతి

బింబద్వారా అధ్యస్తమై యజ్ఞులచేఁ జూడఁబడును, వాస్తవమునను లేవు. జలప్రతిబిం
బితుఁడగు చంద్రునియం దుదకచలనాదికము ప్రతిబింబద్వారా కల్పింపఁబడినటుల బుద్ధి
యందు ప్రతిబింబించిన ఆత్మయందున్నూ బుద్ధిధర్మములు కల్పితమగుచున్నవి, ఆలాగనుక

"కామస్సంకల్పో విచికిత్సా శ్రద్ధా ఽశ్రద్ధా ధృతిరధృతిర్హ్రీర్ధీర్భీరిత్యేతత్సర్వం మనఏవ"

అని శ్రుతియున్నదిగాన మనోధర్మములే నిజము, మరియు యుక్తినిఁ జెప్పుచున్నా
రు. జాగ్రత్స్వప్నములయందు బుద్ధియుండఁగా రాగాదికముండెను. గాఢనిద్రయందు
బుద్ధి, కారణమందు లీనమయిపోయెఁగాన నపుడాత్మ నిర్వికారమైయుండెను గాని రాగా
దు లేమియు లేవుకాఁగా మనోధర్మములే సిద్ధము ఓయి ఆత్మ జ్ఞాతయై యెరుగుచున్నాఁ
డనిను వికారమేలావచ్చినదంటే ఆత్మాభాసయు, బుద్ధివృత్తియు తప్తాయః పిండమువలె
నే కలుసుకున్నందున ఆత్మకావృత్తితో కల్పితసంబంధము కలుగుటను ప్రమాతా జ్ఞాతా సా
క్షిగా వానివలె నున్నాఁడు. ఇంతియగాని ప్రత్యగాత్మకు నొకానొకప్పుడును వికారము
లేదు- బుద్ధికొకప్పుడైనను బోధ్యత్వములేదు- కాన బుద్ధిసహితుఁడగు చిదాభాసునిధి॥

"నతత్ర సూర్యోభాతి నచంద్రతారకం నేమావిద్యుతో భాంతి కుతోయమగ్నిః। త
మేవభాంతమనుభాతిసర్వం తస్యభాసా సర్వమిదంవిభాతి" "యచ్చంద్రమసి యచ్చాగ్నౌ
తత్తేజో విద్ధిమామకం"॥

అని శ్రుతిస్మృతులున్నవిగాన నిట్టి యాత్మ, ఒక దీపమనేక ఘటములను ప్రకా
శింపఁజేసినటులను, ఆసుట్మాదికములచే తాను ప్రకాశింపఁజేయఁబడునటులను, బుద్ధీంద్రి
యాదికములను ప్రకాశింపఁజేయుచున్నాఁడు గాని వానిచేత తానుఁ ప్రకాశింపఁజేయఁబడ
డు- దీపమున కన్యదీపేచ్ఛ లేనటుల జ్ఞానస్వరూపుఁడగు నాత్మకన్యజ్ఞానాపేక్ష లేదు-
బుద్ధిజ్ఞానములచే తెలియరాని యాత్మ నెటుల తెలియవలయునంటే "అథాయమాదేశో
నేతి నేత్యాత్మా" అనువాక్యముచే శరీరబుద్ధ్యాదులు మాయికములుగా తెలసికొని నిరసించి

"యతోవా ఇమాని భూతాని జాయంతే, యేనజాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవి
శంతి, తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ" అనుతటస్థలక్షణశ్రుతివలనను "జన్మాద్యస్యయతః" అను
సూత్రార్థముచేతను, జగ దుత్పత్తి స్థితి లయ కారణమయిన వస్తువాత్మయని నిశ్చయిం
చి విచారించితే శరీరాదిక మేమియు నేనుగాను. ఆత్మయందు ప్రపంచమధ్యారోపి
తముఁగాన నిరసించి

"అప్రాణోహ్యమనాశ్శుభ్రో క్షరాత్పరతఃపరః

ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ
ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ''

ఇట్టి నాకు ప్రాకృతములతోను కాలత్రయమందు సంగములేదు. ఇంతపర్యంత మజ్ఞానవశముచేతను అవిద్యాకార్యము నాదియని భ్రమపడితిని. పూర్వోక్తవిశేషముచే నీయర్థము గురువులు తెలిపిరిగనుక ప్రత్యగభిన్న బ్రహ్మభావమైతిని. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని శృతిగాన నీవిశ్వమంతయు నాత్మస్వరూపమగు బ్రహ్మమేను. బ్రహ్మాభిన్నము జగత్తుగనుక జగద్భ్రమ మజ్ఞానముచే తోఁచినను కారణవ్యతిరిక్తముగ కార్యములేదు గనుక కారణమయిన ప్రత్యగాత్మకన్న నితరములేదని మననము చేయునది. ఇందుకు దృష్టాంతము ఘటాశరావాదులు కారణమయిన మృత్తుకన్న నితరముఁగానట్లుల నాత్మకన్న నితరములేదు. ఓయీ! ఆత్మవినాగా ప్రపంచములేకున్నను ప్రతీతి యున్నదంటివాయనా ఘటాదులుకారణమయిన మృత్తుకన్న వేరుగ లేనప్పటికిని యేలాగుగా తోచునో ఆలాగున తోచవచ్చును. అటుగాన మరుమరీచికలయందు జలముతోచినను లేనిరీతి నీప్రత్యగాత్మయందు జగత్తుతోచినను భ్రాంతిమాత్రమే గాని వాస్తవముగనైతే లేదు. జగద్విలక్షణం బ్రహ్మగనుకను జగత్తు మాయాకార్యముగనుకను కారణమయిన మాయ మిథ్యగనుకను మిథ్యాత్వనిశ్చయమే సత్తాస్ఫూర్తిగనుకను అటువంటి తెలివిఁగలవాఁడై మహావాక్యానుసంధానముఁ జేసుకొనుచు నహంకారవిముక్తచైతన్యుఁడై జీవన్ముక్తుఁడు కావలయును. మహావాక్యములు.

"ప్రజ్ఞానంబ్రహ్మ అహంబ్రహ్మాస్మి తత్త్వమసి అయమాత్మాబ్రహ్మ బ్రహ్మైవేదగ్ంసర్వం ఆత్మైవేదగ్ంసర్వం ఇదగ్ంసర్వం యదయమాత్మా ఏషత ఆత్మాంతర్యామ్యమృతమయః, సయశ్చాయం పురుషేయశ్చాసావాదిత్యే సఏకః సయఏవంవిత్ ప్రజ్ఞాప్రతిష్ఠా విజ్ఞానమానందంబ్రహ్మ. సర్వం ఖల్విదంబ్రహ్మ నేహనానాస్తికించన. ఏకమేవాద్వితీయంబ్రహ్మ. తదేతద్బ్రహ్మ అపూర్వమన పరమనుత్తర మనవాచ్యం సర్వానుభూతి రనుశాసనం, అదృష్టం ద్రష్టృ అశ్రుతగ్ం శ్రోతృ, అమతంమంతృ అవిజ్ఞాతం విజ్ఞాతృ నాన్యోతోస్తిమంతా నాన్యోతోస్తివిజ్ఞాతా యేనేదం సర్వంవిజానాతి. తం కేన విజానీయాత్ విజ్ఞాతారమరేకేన విజానీయాత్. సఏష నేతినేత్యాత్మా. అగృహ్యో నహిగృహ్యతే. అశీర్యో నహిశీర్యతే. అసంగో నహిసజ్యతేఽనహిబధ్యతే. నమరిష్యతే. ఇత్యుక్తానుశాసనీ మైత్రేయీ ఏతావదరేఖల్వమృతత్వ మితి హోక్త్వా అభయంవై జనకప్రాప్తోసి సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ'' ఇవి మొదలగునవి.

మహావాక్యవిచారముఁ జెప్పుచున్నారు. తత్ త్వం అసి. అని మూడుపదములు.

పదమునకు వాచ్యార్థమనియు లక్ష్యార్థమనియు రెండువిధములు. త్వం పదమునకు వా
వాచ్యార్థము దేహేంద్రియ ప్రాణమనోబుద్ధ్యహంకారకృశ స్థూలమూకత్వ కామాది
సకలధర్మములను అస్తి జాయతేత్యాది షడ్భావవికారములును అశనాది షడూర్మ్ములను
ఆత్మయం దారోపించుకొనుచు ఆధ్యాత్మికాది తాపత్రయదష్టుఁడై తాఁ గర్తనను
నభిమానమువలన సంచితపుణ్యపాపములచే స్వర్గనరకములయందు సుఖదుఃఖముల ననుభ
వించుచునుండు ప్రత్యగాత్మ త్వం పదమునకు వాచ్యార్థము. త్వంపద లక్ష్యార్థము.

“యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృదంతర్జ్యోతిః పురుషః యోఽయం దక్షిణే
క్షిణి పురుషః ఇవి మొదలగు నవాంతరవాక్యములచే నిరూపింపఁబడి సర్వోపాధి వినిర్ము
క్తుఁడై తత్సాక్షియై కేవలుఁడై సచ్చిదానందమాత్రమై యుండు ప్రత్యగాత్మ త్వంపద
లక్ష్యార్థము;

“యతోవా ఇమానిభూతానిజాయంతే ఈ మొదలగునవియు సదేవసోమ్యే దమ
గ్ర ఆసీతు ఆత్మావా ఇదమేకఏవాగ్ర ఆసీతుబ్రహ్మవా ఇదమగ్రఆసీతు ఇవి మొదలగు వి
షయవాక్యసంప్రతిపన్నమై సర్వజ్ఞత్వ సార్వేశ్వరత్వ సర్వకారణత్వ సర్వాంతర్యామిత్వ
సర్వనియంతృత్వ సర్వపాలయితృత్వ సర్వసంహారయితృత్వములు మొదలగు విశేషలక్ష
ణయుక్తమైన అనాద్యవిద్యాశ్రయమైన సచ్చిదానందైకరసమైన బ్రహ్మము తత్పద
వాచ్యార్థము.

“సత్యంజ్ఞానమనంతంబ్రహ్మఆనందంబ్రహ్మబ్రహ్మైవేదంఅమృతంబ్రహ్మపురస్తాతు బ్ర
హ్మపశ్చాతుబ్రహ్మదక్షిణతఃబ్రహ్మచోత్తరతఃఅధశ్చోర్ధ్వంచప్రసృతంబ్రహ్మైవమిదంవరిష్ఠం”
ఇవి మొదలగు విషయవాక్యములచేత ప్రతీయమానమయినట్టియు నిత్య శుద్ధ బుద్ధ ముక్త
సత్య పరమానందాద్వయమయిన బ్రహ్మము దత్పదలక్ష్యార్థము. యిట్టిపదములకు వాక్య
మునకు ముఖ్యార్థమందు తాత్పర్యములేదు గానను ప్రమాణాంతర విరోధమున్నందునను
ముఖ్యార్ధమును పరిహరించి లక్షణావృత్తిచే నైక్యము నెఱంగునది. లక్షణావృత్తియన
జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణములు వాచ్యార్థమునంతయువిడచి తత్సం
బంధమగు నర్ధాంతరమందలి వృత్తిజహల్లక్షణము “గంగాయాం ఘోషఃప్రతివసతి” దీని
యందు వాచ్యార్థమగు గంగనువిడచి తత్సంబంధమగు తీరమునందు గొల్లపల్లెయున్నద
ని లక్షించుకొనుట; ఇది జహల్లక్షణము; వాచ్యార్థమునువిడువక నే యర్ధాంతరమందలి
వృత్తి జహల్లక్షణము; “కుంతాఃప్రవిశంతి” ఇందు వాచ్యార్థమునువదలక నే కుంతధా
రులగు మనుష్యులను లక్షించుట; ఇదియు జహల్లక్షణము; ఇక ప్రకృతోపయోగమగు జ
హదజహల్లక్షణముఁ జెప్పుచున్నారు; వాచ్యార్థమందు సగమువిడచి కడమసగమందలి

వృత్తిజహదజహల్లక్షణము; “సోయం దేవదత్తః” ఇందలి సః అనే తచ్ఛబ్దమునకు వాచ్యార్థము. తద్దేశ తత్కాల దేవదత్తుఁడు అయమనే ఇదంశబ్దమునకు నేతద్దేశ ఏతత్కాల విశిష్టదేవదత్తుఁడు వాచ్యార్థము. యీరెండుపదార్థములకును సామానాధికరణ్యముచేత నైక్యముతోఁచుచున్నది. ఈయైక్యము కూడదుగనుక భాగత్యాగలక్షణముచేత తచ్ఛబ్దార్థమందలి తద్దేశ తత్కాలములను ఇదం శబ్దార్థమందే తద్దేశ ఏతత్కాలములనుఁ ద్యజించి యవిరుద్ధమగు దేవదత్తమాత్రమును లక్షించఁగా దేవదత్తైక్యముగూడినట్టు తత్త్వమసీతివాక్యమం దైక్యవిరుద్ధమయిన దేహాదికమును సర్వజ్ఞత్వాదికమును త్యజించి యవిరుద్ధమయిన ప్రత్యగాత్మను సత్యజ్ఞానానందాత్మకమయిన బ్రహ్మమును తత్త్వంపదములచే లక్షించి అసిపదముచే నభేదము బోధింపఁబడెను గాన నఖండైకరసము బ్రహ్మవాక్యార్థము- యీలక్షణ జాతిసంబంధము లాత్మకులేనప్పటికిని బోధార్థమయిన యుపలక్షణముగా దెలిసికొనవలసినది- ఈయర్థముఁదెలిసి గురూక్తమర్మజ్ఞతిని తదాకారాకారితముఁగా సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమయిన బ్రహ్మభావమునుఁ బొందుమనిన గుర్వాజ్ఞను లెస్సగా విచారించినవాఁడు కృతార్థుఁడగును; సజాతీయమన వృక్షమునకు వృక్షము- వృక్షమునకు శిలాదికము విజాతీయము- స్వగతభేదమన పుష్పశాఖాదికము- ఈలాగుగా భేదము ప్రపంచమునకుండును- ఆత్మకులేవని చెప్పుట కృతార్థుఁడగునన్న వాక్యమునకుఁ బ్రమాణములు-

“బ్రహ్మవిదాప్నోతి పరంతరతి శోకమాత్మవిత్ బ్రహ్మవేద బ్రహ్మైవభవతి- తత్రకోమోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః- అభయం వై జనకప్రాప్తోసి- యద్వైధాం సినమిథోఘ్నః- తత్స్వయం యోగసంసిద్ధః- ఈలాగు స్పృతిస్మృతు లున్నవిగనుక నమ్మి కృతార్థుఁడవుగమ్మని యానతిచ్చి ఈతత్త్వసాక్షాత్కారమునకు “ఆత్మావారే ద్రష్టవ్య” ఇతి శృతియున్నందున శ్రవణాదులు సాధనముగాన వాటినిఁ జెప్పుచున్నారు- వేదాంతశాస్త్రముల కాచార్యునివలన శ్రద్ధాపూర్వకముగ నద్వితీయమనిదు తాత్పర్యనిశ్చయమగుట శ్రవణము. ఆశాస్త్రార్థమున్నా సద్గురువు లావరణముఁబాపిన లక్ష్యమున్నా యుక్తులచేఁ బునః పునరాలోచన మొనర్చుట మననము- నిదిధ్యాసయే సమాధి- అది విజాతీయప్రత్యయ తిరస్కారణమై సజాతీయప్రత్యయ ప్రవాహీకరణమై యద్వితీయ స్వానుభవానందముగ తననుఁదెలిసిన తెలివిమాత్రముదక్కఁ దనగూడ మరచి మనస్సునకు కేవలము వృత్తిపాడమక సూచ్యగ్రమందు గురువిందగింజ జారకుండ నిలిపిన సాధనగానుండి తనను మరువవలెను- ఇందుకు శృతి-

“యస్యామతంతస్యమతం మతంయస్యనవేదసః

అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతాం" ఇందుకు తాత్పర్యము-

తనను దెలిసిన తెలివిని యెవరు తెలిసికొని సమాధికాలమున నుందురో వారు తెలిసినవారు కారు- తెలిసి తెలియక యున్నవాడే తెలిసినవాడు- గాన నదియే యమనస్కము అదియే యున్మని- అదియే రాజయోగము- అదియే త్రిపుటిశూన్యమయిన నిర్బీజసమాధి- ఇది యనుభవమా యని యందురేని సర్వసాక్షి తానయిన స్థితి వేదాంతులు తెలిపిన తెలివి తెలిసికొని సాక్ష్యములేక ఆత్మ సందులేక నిండినకథ అనుభవమునకు వచ్చేకాలమున యోగయుక్తిచేత వృత్తినిరోధమువారు కలిపిరా కృతార్థుడగును- అని మరియుఁ జెప్పుచున్నారు- ఈసమాధిలక్షణమునకు లయవిక్షేప కషాయ రసాస్వాదనములని నాలుగువిధముల విఘ్నములుకలవు- వాని స్వరూపనివృత్తు లివి- లయమనఁగా శ్రవణకాలమునగాని సమాధిసమయమునఁగాని నిద్రవచ్చుట- తన్నివృత్తి లేచుట- వృత్తిబహిర్ముఖమగుట విక్షేపము- ఆవృత్తి నిగ్రహమునివృత్తి- కషాయమనగా స్వరూపమందు నిలువక వృత్తి స్తంభించుట- స్వరూపానుసంధానము తన్నివృత్తి; రసాస్వాదనమన విషయోత్సుకము- తన్నివృత్తి యేమియు తలచకయుండుట- ఇవియు గాక భూతవర్తమాన భావిప్రతిబంధములు మూడువిధములఁగలవు- పూర్వమందు తనుచేసిన సంసారస్థితిలో ప్రియమగు వస్తువు సమాధికాలమందు దోచుట భూతప్రతిబంధము- భావిప్రతిబంధము- దయారూపముగ వచ్చునది- భరతుఁడు దయచేతనే మూఁడుజన్మము లెత్తెను- వర్తమానప్రతిబంధము నాలుగువిధములు- విషయాసక్తి, ప్రజ్ఞామాంద్యము, తర్కము, విపర్యయదురాగ్రహము- శ్రవణముఁజేయుచు విషయచింతన మెనవ్వుట విషయాసక్తి- గురువులుచెప్పినవివేకము నిలుపకపోవుట ప్రజ్ఞామాంద్యము- గురువుచెప్పినయర్థమునకు వితండమాడుట కుతర్కము, తాను పండితుఁడను విరక్తుఁడను అని దురాగ్రహపడుట విపర్యయదురాగ్రహము- యిట్టి ప్రతిబంధముల నొందక చతుర్విధవిఘ్నములు రాకుండా హెచ్చరికఁగలిగి వైరాగ్య బోధోపరతులతోఁగూడి యుండవలెను- వైరాగ్యబోధోపరతులకు హేతుస్వరూపకార్యములని కలవు- వైరాగ్యమునకు బ్రహ్మలోక తృణీకారము హేతువు- దేహధారణ వ్యతిరిక్తవిషయములయందు వాంతాశన మూత్రపురీషముల నుందుంబలెనే ఇచ్ఛలేకపోవుట స్వరూపము- తిరుగ విషయముల నేల ననుభవించక విడచితినని తలచకయుండునది కార్యము- బోధకు శ్రవణమననాదులు హేతువు- అందువలన ననాత్మను నిరసించి తానాత్మనని యెఱిఁగిన దృఢనిశ్చయము స్వరూపము- దేహేంద్రియాద్యనాత్మకధర్మములు తిరిగి తోచకయుండునది కార్యము- ఉపరతికి యమనియమాదులు హేతువులు- చిత్తనిరోధము స్వరూపము- సర్వవ్యవహారనాశము కార్యము- యమమనంగా నహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహములు- నియమమనంగా శౌచసంతోష తపస్స్వాధ్యాయే

శ్వర ప్రణిధానములు- ఆసనమనంగా స్వస్తిక పద్మాసనాదులు ప్రాణాయామ మనంగా రేచక పూరక కుంభకాది ప్రాణనిగ్రహము- ప్రత్యాహార మనంగా విషయములవలన జ్ఞానేంద్రియముల నిగ్రహించుట- ధ్యానమనంగా సోహం అహం సః అని విచారముఁజేసుట- ధారణమనంగా లక్ష్యమందు మనస్సునిల్పుట- ఇవి సమాధికి అంగములు అని చెప్పి ఈవైరాగ్యబోధోపరతులలో నొకటికొంచెముఁ గలిగినఁ జాలవా యంటివా? చాలవు-

వైరాగ్యము- ఉపరతియుండిన స్వరూపబోధలేని వైరాగ్యమువలన భోగనిరసనమే గాని ఫలము లేదు- వైరాగ్యబోధలు రెండుఁగలిగెనా? ఇంద్రియములకు విషయోపరమము లేకుండిన సంసారము తిరుగఁబడినచ్చును- కాన వైరాగ్యబోధోపరతులా మూఁడున్నూ కావలయును- అని చెప్పి షడ్విధలింగములచేతను ఆత్మవేద్యమేగనుక వాటిస్థితి వివరించుచున్నారు-

సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయంబ్రహ్మ ఇత్యుపక్రమః ఐతదాత్మ్య మిదంసర్వం తత్సత్యం సఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇత్యుపసంహారః॥ ౧॥

ఈరెండును ఒక్కలింగమేను- నవవారం వాక్యోపదేశోభ్యాసః॥ ౨॥

వేదాంతప్రమాణేన వినా బ్రహ్మతత్త్వం నవిద్యత ఇత్యపూర్వతా॥ 3॥

ఏకం విజ్ఞానాత్సర్వం విజ్ఞాతం భవతీతి అర్థవాదః॥ ౪॥

తరతిశోకమాత్మవిత్ ఆనందంబ్రహ్మణోవిద్వాన్ నబిభేతికుతశ్చన ఇతి ఫలం॥ ౫॥

ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతంస్యాత్ వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యం ఇత్యుపపత్తిః॥ ౬॥

వీటియభిప్రాయము- సృష్టికిపూర్వ మీజగత్తు నామరూపరహితమై సత్తామాత్రమేయుండునని ప్రతిపాదించుట యుపక్రమము- ఈశోచే సమస్తమున్నూ ఆసత్తాయొక్క వివర్తము- అది భ్రమనివృత్తియం దాత్మయనే ప్రతిపాదన ముపసంహారము- ఈ రెండున్ను అద్వితీయాత్మస్వరూపమునే బోధించుచున్నవి గనుక ప్రథమలింగము- తత్త్వమసీతి వాక్యములు మననసిద్ధికొరకు పునః పునరుచ్చరణ మభ్యాసమనే రెండవలింగము- ఆప్తప్రమాణములలో నుపనిషత్ప్రమాణముచేతనే ఆత్మ యెరుఁగఁబడుచున్నది- ఇతరప్రమాణములచే నెరుఁగఁబడదనుట యపూర్వమను మూడవలింగము- ఇది యాత్మయందే సిద్ధించియుండును- ఒకవస్తువును విన్నందుచేతను వినఁబడనివస్తువయును వినఁబడుచున్నదనే

ప్రతిపాదనమనే నాలుగవలింగము- దీనికి స్వార్థమందు తాత్పర్యములేదు- గనుక సద్వితీయాత్మయందే తాత్పర్యము- ఆత్మజ్ఞానమువల్ల ప్రారబ్ధక్షితియందు సమస్తము స్వరూపమే యని నిశ్చయముకలదుగాన కృతార్థుఁడనే ప్రతిపాదకము ఫలమనే యయిదవలింగము- ఉపపత్తియనంగా మృత్తువల్లఁ బుట్టిన ఘటశరావాదులు తమకు కారణమయిన మృత్తుకంటె పృథక్కుగా తోఁచినప్పటికిన్ని ఈకార్యముల వచ్చారణమాత్రమేగాని వేరే సత్తాలేదుగనుక కారణవ్యతిరిక్తముగ కార్యములేదనేయుక్తి ప్రసిద్ధమే గనుక తోఁచే జగత్తున్ను ప్రత్యగభిన్నబ్రహ్మమేగాన నీయర్థమును సూచింపునది యారవలింగము.

యీప్రకారముగ వివరించి కారణభేదములు చెప్పుచున్నారు- జగంబున కీశ్వరుఁడు వివర్తోపాదానకారణము- "స్వరూపాదప్రచ్యుతస్య రూపాంతరాపత్తి ర్వివర్తః" గనుక తనస్వరూపము చెడక జగద్రూపముగాతోఁచుచేను- మాయ పరిణామోపాదానకరణము- రౌప్యభ్రమజ్ఞానమునకధిష్ఠానమయిన శుక్తి వివర్తమున్ను ఆశుక్తియందు విలసితాజ్ఞానము పరిణామకారణము స్వవర్ణము చెడకనే పాలు పెరుగయినట్టు అధిష్ఠానసత్తా వ్యతిరిక్తసత్తా శూన్యత్వము పరిణామలక్షణముగనుక శుక్త్యావరకాజ్ఞానము రౌప్యభ్రమగా పరిణమించఁగా పరిణామకారణ మనఁబడును. ఇటువలె నీశ్వరునియం దనిర్వచనీయాజ్ఞాన సంబంధంబుననున్న మాయ పరిణామమున్ను ఈశ్వరుఁడు వివర్తమున్ను కాఁగా నాశబ్దబ్రహ్మమే

> "కార్యోపాధిరయంజీవః కారణోపాధిరీశ్వరః
> కార్యకారణతాంహిత్వా పూర్ణబోధోవశిష్యతే"

అని యున్నదిగనుక నుపాధివశమున జీవేశ్వరులయిరి. దీపము ప్రకాశింపుచుండఁగా సన్నిధిఘటములు ప్రకాశించినట్టుం బలెనే తనయం దారోపింపఁబడ్డ జీవేశ్వరాది ప్రపంచము తనప్రకాశవల్లనే ప్రకాశించుచున్నది. అట్టిప్రకాశ తానను వేదాంతవిచారమువల్లఁ బుట్టిన చిత్తవృత్తి బ్రహ్మజ్ఞానము. అదిగలవాఁడు బ్రహ్మవిత్తు.

> "బ్రహ్మవిచ్చాత్మసత్యత్వం విశ్వంస్వప్నవదేవహి
> నిత్యంపశ్యతి మిథ్యేతి సోయం ప్రాథమికోమతః"

ఇదిగాక శుద్ధ ఈశ్వరజీవ చైతన్యముల స్థితి మునుపు చెప్పిరాగా ప్రమాతృ ప్రమేయ ప్రమాణఫల చైతన్యములనికలవు.

"అంతఃకరణసంబంధం ప్రమాతేత్యభిధీయతే
తథాతద్వృత్తి సంబంధాత్ప్రమాణమభిధీయతే
అజ్ఞానమవచ్చైతన్యం ప్రమేయమితి కథ్యతే
తథాజ్ఞాతంచ చైతన్యం ఫలమి త్యభిధీయతే"

అన్నారు గాన ఘటమును తెలియవలసిన వాని యంతఃకరణచైతన్యము ప్రమాతృచైతన్యము అది వృత్తిమత్తై యుండును గనుక ఆవృత్తిఘటమున్ను పోయి పొందఁగా వృత్తిపోయిన దిక్కంతయు చైతన్యం సాక్షిగా వృత్తియందు ప్రతిఫలించుచుండును గనుక నది ప్రమాణచైతన్యము ఆవృత్తిపోయి ఉపాధైక్యమువలన ప్రమేయమయిన ఘటముయొక్క ఆవరకాజ్ఞానమును పోఁగొట్టఁగనే ప్రమేయచైతన్యము. ప్రమేయచైతన్యము ప్రమాతృచైతన్యము ఐక్యమాయెను గనుక అయం ఘటః అనేజ్ఞానముతోచే జ్ఞాతృత్వము ఫలచైతన్యము. ఈప్రపంచమందు దృశ్యమానమైయుండే సకలపదార్థములకున్ను ఈలాగుగనే విచారించుచు తెలుసుకునేది. ఈలాగుగా నీస్థితిచెప్పి మరి వివరించుచున్నారు.

ఓయీ వృత్తిఘటావరకాజ్ఞానము పోఁగొట్టునంటివే? చీకటి చీకటినిపోఁగొట్టునా? అంటివేని మృత్తగు చాడు వస్త్రమునంటిన మృత్తునుపోఁగొట్టదా? ఇది యాజడాజ్ఞానముకంటె వృత్తి చురుకుగనుక పోఁగొట్టును. అటులయిన నాఘటపటాదులను గోచరింపజేసే ఆవృత్తి బ్రహ్మమును గోచరింపఁజేయవలయునే యంటివేని కలుషయుక్తమైనది గాన చేయలేదు. యేలాగనిన చెప్పుచున్నారు. ఘటపటాదులను గోచరింపఁజేయు దీపము సూర్యునిఁ ప్రకాశింపఁజేయలేని యట్టులేను. అయితే నాతెలివి వృత్తియే జ్ఞప్తియేనంటివా? జ్ఞప్తి వృత్తిమత్తుగాక వస్తువును ప్రకాశింపఁజేయదు. అదెటువలెనంటే చిత్తవృత్తి మరియొకపదార్థమందు చేరినప్పుడు దగ్గరనుండి పిలచినా వినదు. చేరికనున్నను కానదు.

అయితే చైతన్యమునకు అజ్ఞానమునకు విరోధమా, అవిరోధమా అంటివా విరోధమేను అట్లైన ప్రత్యగాత్మచేతను అజ్ఞానధ్వంసద్వారా భిన్న బ్రహ్మభావము పొందఁబడదే అని అంటివేని దృష్టాంతపూర్వకముగా చెప్పుచున్నాము. సూర్యునికి యెండ నిండియున్నను పదార్థములనుదహింపదు. ఆయెండయే స్ఫటికద్వారా తృణాదికమును దహించును. దార్ష్టాంతికమందు చైతన్యమున్ను వృత్తిమత్తైనప్పుడా యజ్ఞానమున్ను హరించును. స్వస్వరూపప్రాప్తిపొందును. ఆపిమ్మట ప్రత్యక్ప్రవణమగు నావృత్తికతకరేణువు బురదనీళ్ళను తేటపరచి తాను లేకపోయినట్లే లేకపోవును. ఆవృత్తిలయమే మనోలయము మనోలయమే జీవన్ముక్తిభావము.

మనసోవృత్తి శూన్యస్య బ్రహ్మాకారతయాస్థితిః
తన్మనో విలయంయాతి తద్విష్ణోః పరమం పదం॥

చైతన్యము స్తచిత్తు బ్రహ్మస్వరూపము గనుక గురుకటాక్షముచే బ్రహ్మీభూతుఁడౌను. ఈ చెప్పిన ప్రత్యక్స్వభావమును చెప్పుచున్నారు. ప్రత్యక్కనఁగా నీశ్వరుఁడా? జీవుఁడా? బ్రహ్మమా? అంటివాయనా శరీరాభిమాని జీవుఁడు. బ్రహ్మాండాభిమాని ఈశ్వరుఁడు. నిరుపాధికము చైతన్యము- మరియవరనిన వ్యష్టిదేహాంతర్వర్తియైయుండి ఈయభిమానాదిగుణములు మిథ్యగా విచారించి దేహేంద్రియాది వ్యాపారము ప్రాతిలోమ్యముచేతను అద్వైతమయిన బ్రహ్మమొక్కటియే సత్యము- ఆబ్రహ్మమే నేననే అంతరవిచారముచేతను ఉండే శుద్ధజీవుఁడు ప్రత్యక్కు- అట్టి భావనఁగలవాఁడు నిద్రమబ్బువచ్చినవాడువలెనుండి జీవన్ముక్తుఁడై దేహచ్యుతియందు బ్రహ్మభావమును పొందును- వాఁడు బ్రహ్మవిద్వరుఁడు-

అంతర్ముఖతయానిత్యం నిద్రాళురివలక్ష్యతే
ద్వితీయః ప్రోచ్యతేనిత్యమేకం బ్రహ్మవిదాంవరః॥

ఇదియే సమాధియగును- ఈ సమాధికిఁగల భేదములను చెప్పుచున్నారు- సవికల్పము- నిర్వికల్పము- వీటినీ సంప్రజ్ఞాతా అసంప్రజ్ఞాతా అందురు- సవికల్పమందు దృశ్యానువిద్ధము- శబ్దానువిద్ధము.

ఉపేక్ష్యనామరూపేద్వే సచ్చిదానంద తత్పరః
సమాధిం సర్వదాకుర్యాద్ధృదయేవాథవా బహిః
సవికల్పోవికల్పశ్చ సమాధిర్ద్వివిధోహృది
దృశ్యశబ్దానువిద్ధేన సవికల్పః పునర్ద్విధా
కామాద్యాశ్చిత్తగాదృశ్యాస్తత్సాక్షిత్వేనచేతనం
ధ్యాయేద్దృశ్యానువిద్ధోయం సమాధిస్సవికల్పకః
అసంగ స్సచ్చిదానంద స్స్వప్రభోద్వైతవర్జితః
అస్మీతి శబ్దవిద్ధోయం సమాధిస్సవికల్పకః॥అని॥

దృశ్యమంతయు ప్రపంచికము ప్రాపంచికమంతయు భ్రమయేగాన ఇంద్రియములు వాటివాటి విషయములయందు వ్యవహరించుచున్నను

'తథాహిసంశయశ్చేత్సంశయతేయస్స ఏవభవసిత్వం'

అనియున్నది గనుక నధిష్ఠానమువినా ఇతరమేమియు లేదు. గాన తోచినప్రపంచము విచారముచేతచూచితే అతన్నిరసనానంతరమందు చైతన్యమే గనుక యెండమావులు నీళ్లు అనితోచి విచారించితే నీళ్ళులేక యండమావులే నిజమయినట్టును రజ్జువందు సర్పమారోపింపఁబడి తెలిసినపిదప సర్పములేక రజ్జువేయుండినట్లు సర్వగతమైన బ్రహ్మమును ఈలాగుగా విచారించి నిశ్చయముచేసికొనుట దృశ్యానువిద్ధ; ప్రపంచము మిథ్యయని విసర్జించి సచ్చిదానందాద్వయమై నామరూపరహితమైన బ్రహ్మము నేనని సకలశబ్దములను విడచి యాశబ్దములచే తోచెడు బ్రహ్మమందే తాత్పర్యముంచుట శబ్దానువిద్ధ; వీనియందీ నిశ్చయముచే ధ్యానగరిష్ఠుఁడై అన్నపానాదులకు సహాగానొకరిచే తెలుపఁబడేవాఁడు బ్రహ్మవిద్వరీయుఁడు.

పార్శ్వస్థబోధితోనిత్య మన్నపానపరాణయం
సోయం బ్రహ్మవిదాంనిత్యం వరీయానితిచోచ్యతే॥

ఇక నిర్వికల్పమునుఁ జెప్పుచున్నారు.

అనుభూతిరసావేశో దృశ్యశబ్దానపేక్షకః
నిర్వికల్పసమాధిస్స్యా న్నివాతాచలదీపవత్
హృదివద్బాహ్యదేశేపి యస్మిన్కస్మింశ్చవస్తుని
సమాధిరాద్యస్సన్మాత్రా న్నామరూపనిరాకృతిః
అఖండైకరసంవస్తు సచ్చిదానందరూపకం
ఇత్యవచ్ఛిన్నచింతోయం సమాధిర్మధ్యమో భవేత్
స్తబ్ధీభావోరసాస్వాదః ప్రత్యయః పూర్వవన్మతః
ఏతైస్సమాధిభిర్నిత్యం నయేత్కాలం నిరంతరం॥

ఈలాగుగానున్నది- గనుక ఈచెప్పివచ్చిన దృశ్యశబ్దానువిద్ధలనుఁగూడక జలమందలి కతకరజోన్యాయమున వృత్తినశించినపిమ్మట ప్రకాశమానమయిన తానొకడనేయని త్రిపుటిలయించి సుప్తుఁడునుంబలెనే స్వానుభూతితోనుండునది నిర్వికల్పసమాధి. ఈయవస్థవాఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు- ఉత్తమమధ్యమాధమభేదములచేనుండి కాలము వెళ్ళించును- అన్నపానాదులకు తాను తెలివిపడడు- ఒకరు తెలిపినా మిక్కిలి యిచ్ఛ యుంచకే జీవన్ముక్తుఁడై కృతార్థతఁ బొందును-

నిద్రాదౌజాగరాంతేతు యోభావమనుభాసతే
తంభావం భావయేద్యోగీ॥

గనుక నట్టి యానందము ననుభవించును- ఈచెప్పిన నలుగురు ముక్తులే- నద్యస్సిద్ధియు దేహాంతస్సిద్ధియుమాత్ర మెక్కువతక్కువగా నందును-

నస్వతః పరతోవాపి ఉద్ధానం యస్యవిద్యతే
సోయం బ్రహ్మవిదాం నిత్యం వరిష్ఠ ఇతిగీయతే
తారతమ్యేన సర్వేషాం చతుర్ణాంసుఖముత్తమం
తుల్యాంగతుర్ణాం ముక్తిస్తుదృష్టసౌఖ్యం విశిష్యతే॥

అని యానతిచ్చితేవిని విన్నపముఁజేసుకొనుచున్నాఁడు; స్వామీ! నిర్వికల్పసమాధియందు త్రిపుటిలయించునని యానతిచ్చితిరే ఆకాలమున త్రిపుటియేటువలె లయించెనంటే త్రిపుటివృత్తివికారమే గనుక వృత్తిలయించఁగనే తాను లయించెనని చెప్పిన మఱియు శిష్యుఁడిట్లనియెను; స్వామీ! జాగ్రత్స్వప్నములలోను వృత్తియుండెనుగాన త్రిపుటియుండెను- సుషుప్తియందు వృత్తిలేదుగదా? త్రిపుటికథయేమి యనిన అంతఃకరణము కారణాత్మనావుండెను గనుకను వృత్తిలేదుగనుకను త్రిపుటిలేదనియే తోచును- అయితే కొందరున్నట్టుగా విచారించినారు- వారి యుక్తి వినుమని చెప్పుచున్నారు- నిద్రలేచిన పురుషుఁడు సుఖముగ నిద్రబోతిని యేమియు నెఱుగనని యనును- ఈసుఖాజ్ఞానములను సాక్షిగావుండి ఉద్ధానకాలమున నాస్థితిగోచరించుకొనుచున్నాఁడుగదా? అంటే స్వామీ! ఇదివృత్తివికారముఁగాదా అంతఃకరణము కారణాత్మనా ఉన్నప్పుడు వృత్తియెటువలె తోచునంటే అధికారణమైనయవిద్య యొక్కవృత్తి అవిద్యకు వృత్తి విన్నామా అనేవు అందుకుయుక్తి చెప్పుచున్నాము. ఈశ్వరుఁడు జగన్నిర్మాణముఁ జేసెను. ఆనిర్మాణము సంకల్పముచేతఁగానికాదు. ఆసంకల్పమంతఃకరణధర్మము- అంతఃకరణము మనకువలెనే ఈశ్వరుకిఁ జప్పరాదు- గాన తదుపాధియయిన మాయావృత్తిమహిమయని చెప్పఁగూడి నటువలెనే ఇక్కడ అవిద్యకున్నూ వృత్తియున్నట్టుగా నూహించినారని యానతిచ్చి ఇటువలె త్రిపుటిశూన్యమయిన నిర్బీజసమాధియలవడుటే కృతార్థత అదియే స్వస్వరూపానుభవమయిన స్వానుభూతి యీప్రకారమున స్వానుభూతి దొరకక నిర్వికల్పమగుటకు చిత్తవృత్తినిరోధముఁజేయువాఁ డధముఁడు- తాను స్వప్రకాశుఁడనని యనుభవముఁగలిగి నిర్వికల్పమునకు చిత్తవృత్తి నిరోధమెందుకవలెనని కోరువాఁడు మధ్యముఁడు- మనోవృత్తినిరోధించుటదియంతయు స్వానుభూతికొరకేకదాయని తెలిసికొని పూర్వాభ్యాసబలమున చిత్తముదృశ్యమందు ప్రవర్తింపకుండాబట్టి స్వప్రకాశుఁడనైన నాకు చిత్తవృత్తితోఁ ప్రయోజనమేమని తెలిసి స్వప్రకాశుఁడననేటిదియులేక తననిజానందుండువాఁడుత్తముఁడు- నిర్వికల్పసకళంకములనునవి స్వప్రకాశమువినాసర్వమును కల్పి

తమేకదా? అనియత్యంత ధృఢనిశ్చయముఁగలవాడు ఉత్తమోత్తముఁడు- అతఁడేజీవన్ముక్తుఁడు- ఇకనథమాథముని లక్షణములు. నిర్వికల్పార్థకమై చిత్తవృత్తినిరోధము చేయుచుండిన నదియేగాని స్వానుభూతిలేదు వానికి దేహము తూగితూగి పడును- జ్ఞాతృజ్ఞేయజ్ఞానరూపమయిన త్రిపుటిభంగము గాక దబ్బరభావనలు పుట్టును. సంశయనివృత్తిలేద్ను, భ్రష్టుఁడుగాన నాముష్మికమున్నూ లేదు.

నాయంలోకోస్తినపరోనసుఖం సంశయాత్మనః
సంశయాత్మావినశ్యతి సాంసారికసుఖాసక్తం బ్రహ్మజ్ఞోస్మీతివాదినం
కర్మబ్రహోభయభ్రష్టంతంత్యజేదంత్యజంయథా
సర్వేబ్రహ్మవదిష్యంతి సంప్రాప్తేతుకలౌయుగే
నానుతిష్ఠంతికౌంతేయ(మైత్రేయ)శిశ్నోదరపరాయణాః॥ కాఁగాభ్రష్టసిద్ధము

ఈ చెప్పినకృతార్థుఁడే స్వేచ్ఛాపరేచ్ఛానిచ్ఛలయిన త్రివిధప్రారబ్ధముల ననుభవించియు ననుభవించనివాఁడై శాస్త్రదేహాలోకవాసనలువిడచి ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికములయిన తాపత్రయవిముక్తుఁడై సచ్చిదానంద స్వరూపుఁడై యుండును- ఇట్టికృతార్థునికి త్రివిధకర్మములేమయ్యెనంటివా? గురుకటాక్షముచేత దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యమయిన వస్తువుతానగే పూర్వజన్మములయందు నిష్క్రియమున్నూ నిర్ధర్మకమున్నూ అయినవాడే గనుక నకర్తృత్వము సిద్ధించి కర్మతూలరాసులు జ్ఞానాగ్నిచేదహింపఁబడెను-

'జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం' అనియున్నది గనుక సంచితకర్మములు యీలాగు నాశించెను- ప్రారబ్ధ మనుభవైకనశ్యము గాన వేసిన శరము గురిదాఁకక కాని నిలువదు గనుక దేహారంభక ప్రారంభక ప్రారబ్ధము దేహక్షపణ పర్యంతమువుండును- అలోకవశము చేతచేసినను చేయనివాడేను- గాన నాకర్మబంధమంటదు కర్తృత్వాభిమానము లేదుగాన నాగామికి బీజము నశించెను- కర్మవాసనావాసితములయిన కారణ లింగశరీరములు నశించినందున లింగశరీరభంగము; అవిద్యాత్యంతోపరతి మోక్షముగలుగును గాన ముక్తుఁడు- "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి యఏవంవేద" అనియానతిచ్చి 'నతస్యప్రాణా ఉత్క్రామంతిఅత్రైవ సమవలీయంతే' అని శృతివున్నది గనుక జ్ఞానికి రాకపోకలులేవు- 'జ్ఞానం వినామోక్షోనవిద్యతే' నాన్యఃపంథావిద్యతేయనాయ॥ అని శృతి గనుక జ్ఞానియే మోక్షవంతుఁడు- ఇదియే సన్మార్గము- అని యానతిచ్చి

అగ్నిర్జ్యోతిరహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణం
తత్రప్రయాగచ్ఛంతి బ్రహ్మబ్రహ్మవిదోజనాః॥

అని ఈశ్వర గీతావాక్య మున్నది గదా? ఇట్టి కాలమున నీలాగుగా తర్లినవారు బ్రహ్మప్రాప్తులౌదురనియు ఉత్క్రాంతి గలుగుననియుం జెప్పియుండెనే, యిందు కేమి యంటే చెప్పుచున్నారు. అది సగుణోపాసకులగు యోగుల విషయమై చెప్పిన వచన ము గనుక ఆయుపాసకు లుపాసనాబలమువల్లను ధూమ్రాది మార్గమునంబోక నర్చిరాది మార్గమునంబోయి బ్రహ్మ లోకప్రాప్తులై అక్కడ బ్రహ్మతోంగూడా వేదాంతశ్రవణ మొనర్చి జ్ఞానులై యక్కడనే లింగశరీరభంగము నొందుదురు. ఇందుకు శ్రుతి

"యఏతమేతద్విదుర్యే తేర్చిరభిసంభవత్యర్చిషోహరహ్న ఆపూర్యమాణపక్షమాపూ ర్యమాణపక్షాద్యాన్ షణ్మాసానుదగాదిత్య ఏతిమాసేభ్యో దేవలోకం దేవలోకాదాదిత్య మాదిత్యాద్వైద్యుతంతాన్వైద్యుతాత్పురుషోఽమానవ ఏత్య బ్రహ్మలోకాన్గమయతి తేషు బ్రహ్మలోకేషుపరాః పరావతోవసంతి తేషాంన పునరావర్తత ఇతి॥"

అనిన్నీ ఇదిగాక "అనావృత్తి శ్శబ్దాత్" అని సూత్రమున్నది గనుకను ఉపాస కులు బ్రహ్మతోంగూడా ముక్తులుకాంగా నావిరోధములేదు.

> అంతకాలేచమామేవ స్మరన్ముక్త్వాకళేబరం
> యఃప్రయాతిసమద్భావం యాతినాస్త్యత్రసంశయః॥

అని బహుగా చెప్పియున్నది.

> "జ్ఞానంవినామోక్షోనవిద్యతే"

అని యున్నందు కేమియంటె చెప్పుచున్నారు. అస్మచ్ఛబ్దముచేతను సకలభూతస్థమయిన తననే యనుట ఏవకారముచేతను అనన్యము చెప్పుట. స్మరన్ అనంగా యిటు వంటి ప్రత్యగభిన్నబ్రహ్మసంధానమనుట, కాగా నిదే జ్ఞానము గనుక విరోధములేదు అని యంటే స్వామీ! సర్వం ఖల్విదం బ్రహ్మ బ్రహ్మైవేదగ్ం సర్వం ఆత్మైవేదగ్ం సర్వం బ్రహ్మైవవిశ్వమిదం వరిష్ఠం ఈలాగుగా బ్రహ్మ మఖండమన్న శ్రుతులానతి చ్చితిరే॥

> ప్రాణిషుహృదంతర్జ్యోతిః పురుషః।
> యోయందక్షిణేక్షిణిపురుషః॥

ఈలాగున హృత్పుండరీకవాస్యీశ్వరుడని ఏకదేశసత్వ్రుతులున్నా చెప్పలెదె. దా కేమియననిని చెప్పుచున్నారు. బ్రహ్మము దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమై యఖండమై

యంటరే సిద్ధము ; సూర్యుని ప్రభస్వగతమైయుండియు దర్పణమందు ప్రసరించినపుడా ధాళధళ్యమెక్కువైనటుల ప్రాణి సంస్కారవాసనావాసితమగు హృద్దేశముఁ గలదు. అదియే ఆజ్ఞాచక్రము అదియె దహరాకాశము, అదియే గుహ, అదియే సుషుమ్న.

యతోనిర్యాతి విషయాన్యస్మిం శ్చైవప్రవీయతే
హృదయం తద్విజానీయాన్మనసస్థితి కారణం॥

దీనియందు ప్రతిఫలించగనే బింబమునకు సోపాధికత్వము వచ్చెను. ఆ యుపాధి క్షయమందు చైతన్య మఖండమేగాన విరోధములేదంటే ఇట్టి హృద్దేశమెదియోయావతీ యుఁడనిన జెప్పుచున్నారు.

సయఏషోంతర్హృదయ ఆకాశః
తస్మిన్నయం పురుషో మనోమయ
అమృతో హిరణ్మయః
అంతరేణ తాలూకేయ ఏవ స్తన ఇవావలంబతే
సేంద్రయోనిః యత్రాసౌ కేశాంతో వివర్తతే
వ్యపోహ్యశీర్షకపాలే॥

ఈలాగుగానున్నది గనుక తాలుమూలమధ్యమందు ప్రకటమైన జిహ్వామూలమం దూర్ధ్వగతమై కపాలకటాహమందు కేశాంతమధ్యగతమై సుషుమ్నగుహకలదుగదా? ఇదియే హృద్దేశము, ఇదియే బింబమునకు ప్రతిఫలితస్థానమైన దీనియందు బింబము ప్రతిఫలించి మనోమయమై యుండును. అక్కడనే ఆజ్ఞాచక్రమందు మండలత్రయమున్నది. గాన,

తత్సవితుర్వరేణియం భర్గోదేవస్యధీమహి॥

అని యుపాసకులకు సూర్యమండలవ్యాప్తమైన తేజస్సు ఉపాస్యమయియుండును. అది బ్రహ్మాండమండలిస్థితిగదా యంటివేని

యావాన్వాఅయమాకాశస్తావానంతర్హృదయ మాకాశః॥

గనుక బ్రహ్మాండమందుఁగల దంతయు పిండాండమందుఁ గలిగి యుండును. ఈ హృద్దేశముఁ జెప్పినా తెలియదంటే యిందు కాచార్యసూక్తి "పశ్యావిశస్యమానే ప్రసిద్ధం" అనుదానియందు పశువిశసనమందు విశదమగానన్ని తాత్పర్యముకాదు. జీవత్వభ్రాంతి యందు గోచరించుననుట కాగా హృద్దేశమాకాలమునఁ గాని గోచరించదు. ఇదిగాక

ఆరాధయామి మణిసన్నిభ మాత్మలింగం మాయాపురీ హృదయ పంకజ సన్నివిష్టం। శ్రద్ధానదీవిమలచిత్త జలాభిషేకై ర్నిత్యం సమాధికుసుమైర్న పునర్భవాయ॥

గనుక నాత్మలింగోపాసనచేఁ గృతార్థుఁడు కావలెను.

అప్రవస్యప్రప్లవస్య అండీ భవజ్జ్యామహుః
సుఖాదిం దుఃఖనిధనాం ప్రతిముంచ స్వస్యాంపురీం॥

అని శ్రుతియున్నది గనుక నోయీ, జీవుఁడా! దుఃఖహేతువైన దేహాభిమానము నువిడిచి మాటిమాటికి బ్రహ్మాండకర్తఁవిగాక సుఖముగ జీవన్ముక్తుఁడవై యంతట విదేహమందు ముక్తుఁడవుగమ్ము, గనుక జీవన్ముక్తుడవై యుండుమని ఆనతిచ్చిన వందనము నర్చి స్వామీ!

• మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయో పపద్యతే । ॥ నమే భక్తః ప్రణశ్యతి। మాంచయో వ్యభిచారేణ భక్తియోగేన సేవతే॥

అని భక్తిమహిమచాలా యున్నదంటివా, భక్తియనభజత్యాత్మానమనయేతిభక్తిః ఇదిగాక పూజాసంకీర్తనాదుల నవ్యభిచారముగ పరమేశ్వరుని అహర్నిశ మనుసంధానము చేయుచుండుట. గనుక

సకృత్స్మృతోపిగోవిందో నృణాం జన్మశతైరపి
పాపరాశిం దహత్యాశుతూలరాశిమివానలః
సకృదుచ్చారితంయేన హరిరిత్యక్షరద్వయం
కృష్ణేతిమంగళంనామయస్యవాచి ప్రవర్తతే
స్మృతేసకలకల్యాణభాజనం యత్రజాయతే
కోటయో బ్రహ్మహత్యానామగమ్యాగమకోటయః
పద్యః ప్రళయమాయాంతి మహాదేవస్యకీర్తనాత్॥

అని బహుగా నున్నది గాన స్మరణాదికముచేత జ్ఞానప్రతిబంధక దురితధ్వంసద్వారా కృతార్థుఁడగును. గనుక భక్తిపరమసాధనము. ఆభక్తి ముదిరి త్రిపుటివినశించిన జ్ఞానియగును. గాన విరోధములేదు. ప్రారబ్ధక్షపణ పర్యంతము కర్మము ఆచరించుట ముఖ్యమగునా, కాదా యనిన చెప్పుచున్నారు.

నకర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోశ్నుతే
నచసన్న్యసనాదేవసిద్ధిం సమధిగచ్ఛతి
యశ్శాస్త్రవిధిముత్సృజ్యవర్తతే కామకారతః
నససిద్ధిమవాప్నోతి॥

అని చెప్పినందున నజ్ఞానులు కర్మత్యాగముఁ జేయరాదు.
"ఆరురుక్షోర్మునేర్యోగం కర్మకారణముచ్యతే"

అనియున్నందున చిత్తశుద్ధిపర్యంతము విధ్యుక్తమగుకర్మాచరణ మావశ్యకము.

త్యక్త్వాకర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
సర్వకర్మఫలత్యాగం తతః కురుయతాత్మవాన్
అనాశ్రితఃకర్మఫలం కార్యం కర్మకరోతియః
ససన్న్యాసీచయోగీచ ననిరగ్నిర్నచాక్రియః
కర్మణ్యేవాధికారస్తు మాఫలేషుకదాచన
మాకర్మఫలహేతుర్భూర్మాతే సంగోస్త్వకర్మణి॥

అని చెప్పియున్నందున ఫలాపేక్షలేక పరమేశ్వరార్పణముగ కర్మచేయుటచే న కర్తృత్వాత్మజ్ఞానము చిత్తశుద్ధిద్వారా పరశివానుగ్రహమువలనఁ గలిగి కృతార్థుఁడగును.

యోగారూఢస్యతస్యైవశమః కారణముచ్యతే
సర్వకర్మాణిమనసాసన్న్యస్యాస్తేసుఖంవశీ
యస్త్వాత్మరతిరేవస్యాత్ సర్వకర్మాఖిలం పార్థ జ్ఞానేపరిసమాప్యతే
సర్వంజ్ఞానప్లవేనైవవృజినం సంతరిష్యసి
తేషాంజ్ఞానీ నిత్యయుక్తః సర్వధర్మాన్పరిత్యజ్య॥

ఇవి మొదలుగాఁ జెప్పియున్నవిగాన పరశివానుగ్రహముచే చిత్తశుద్ధిద్వారా అద్వయానంద ప్రాప్తుఁడగును.

లోక సంగ్రహమేవాపి సంపశ్యన్కర్తుమర్హసి
కుర్వన్నాప్నోతి కిల్బిషం యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరోజనః
సయత్ప్రమాణంకురుతే లోకస్తదనువర్తతే
నబుద్ధిభేదంజనయే దజ్ఞానాం కర్మసంగినాం॥

అన్నారు గనుక జ్ఞాని దృష్టాంతముచే లోకభ్రంశరాకయుండ నాచరించినను కర్మబంధకము పొందక యుండును. పిమ్మట నివృత్తి జ్ఞానశూన్యుఁడైన నాకర్మములులా మేజారిపోవును. అనిఆనతిచ్చినస్వామి! కర్మాచరణపరిత్యాగములేయాశ్రమధర్మములంటే,

వేదోనిత్యమధీయతాంతదుదితం కర్మస్వనుష్ఠీయతాం
తేనేశస్యవిధీయతామపచితిః కామ్యేమతిస్త్యజ్యతాం
పాపౌఘః పరిధూయతాం భవసుఖేదోషోను సంధీయతాం॥

అని శిక్షయున్నది గాన ముందు చెప్పినరీతిని గృహస్థుకర్మాధీనుఁడగుటచే నారురుక్షువగు గృహస్థుకర్మము నాచరించవలయును ఆచరించినను ఫలనిరపేక్షుఁడాయెనేని ప్రవ్రజుని ఫలమునే పొందును. "అనాశ్రితః కర్మఫలం" అనేశ్లోక తాత్పర్యమును తెలసికొనుఁడు. "ననిరగ్నిర్నచాక్రియః" అనఁగా, అగ్నిసాధ్యానగ్నిసాధ్యములయిన ఇష్టాపూర్తకర్మములు సన్న్యసించినవాఁడే ప్రవరాట్ గాడు విహితమగు కర్మమును ఫలాపేక్షలేక నాచరించినవాఁడును సన్న్యాసియేను చిత్తసమాధానమాయనుగాన యోగిన్నీ కాఁగా పిమ్మట నిజగృహాత్తూర్ణం వినిర్గమ్యతాం సంగం సత్సువిధీయతాం అనిన్నీ,

ఏకాకీయత చిత్తాత్మానిరాశీరపరిగ్రహః
సర్వకర్మాణి మనసాసన్యస్యాస్తేసుఖంవశీ అనికేతస్థిరమతిః
విహాయకామాన్య స్సర్వాన్పుమాంశ్చరతినిస్పృహః సర్వారంభపరిత్యాగీ॥

అని ఇవిమొదలుగా నున్నవి గనుకను గార్హస్థ్య ధర్మములు కావు గనుకను ఈవ్యవస్థ హంస పరమహంసల ధర్మములు గనుకను పరిత్యాగి ప్రవ్రజుఁడే సిద్ధము.

"యదహరేవవిరజేత్తదహరేవ ప్రవ్రజేత్"॥

అని సన్యసించుమని శ్రుతి గనుకను గృహస్థుఅయిన సకలకర్మలకును ఫలత్యాగము చేయవలయును.

అనాశ్రితః కర్మఫలంకార్యంకర్మకరోతియః
ససన్న్యాసీచయోగీచ॥

అని యున్నందున ఫలత్యాగమే చేయవలయును. అటులైన జ్ఞానకర్మలకు సముచ్చయముకూడునా, యని శంకరాగా చెప్పుచున్నారు. కర్మచే సాక్షాన్మోక్షము కలుగ

డు. కర్మవలన దురితక్షయద్వారా చిత్తశుద్ధి, చిత్తశుద్ధిద్వారా జ్ఞానప్రాప్తిగాని మఱి యొకటిగాదు. జ్ఞానముచే సాక్షాన్మోక్షమే గనుక జ్ఞానకర్మలకు సముచ్చయముకూడదని చెప్పితే వినీతుండై వందనమొనర్చి విన్నపముచేయుచున్నాఁడు.

కాశ్యాంతుమరణాన్ముక్తిః

అన్నారే వెనుక చెప్పిన దానికి విరోధముకాదా, అనిన లేదు అనేకసుకృతవిశేషములచేఁగాని కాశీమరణము కలుగదు. కలిగిన యజ్ఞానజంతువుకయినను ఏకవింశతి మహానరకముల యాతనాశూలాగ్రమందు భైరవుఁడు క్షణమాత్రముననే యనుభవింపఁజేసిన, పిదప పరశివుఁడు గురురూపమై తారకమును

శ్లో॥ పాయంపాయం శ్రవణపుటకై రామనామాభిరామం
ధ్యాయన్ధ్యాయన్మనసి సతతం తారకబ్రహ్మ తత్వం
జాపజ్జాపత్ప్రకృతి వికృతీ ప్రాణినాం కర్ణమూలే
వీధ్యాంవీధ్యామటతిజటిలః కోపి కాశీనివాసః॥

ఈలాగుగా సంచరించుచు

శ్లో॥ ప్రాణాంశ్చజంతోర్మణికర్ణికాయాం
మద్వాచకం తారకముచ్చరంతి
శ్రుత్వాచవేదాంతముపాస్యవాక్యం
భజంతిమామేవహి విశ్వనాథం॥ అనిన్ని,

శ్లో॥ ముముక్షో ర్మణికర్ణ్యంతరర్ధోదకనివాసిన
అహందిశామితే మంత్రం తారకబ్రహ్మవాచకం॥

అని యున్నది గనుక నుపదేశముఁజేయును.

శ్లో॥ వారాణస్యాం పురారిః పరమకరుణయాముక్తిదో విష్ణుభక్తం
గంగాయా మర్ధదేహం హరిహరశుకవిం ప్రాహకర్ణేకివేదం
నేయం కాశీనగంగాత్వమపినచహరశ్చైవ ముక్తిర్నచాహం
సర్వం చైతన్యమాత్రం జగదిద మఖిలం స్వప్నవచ్చిద్వివర్తం॥

ఈ తారకార్థోపదేశమును దక్షిణకర్ణమందు చేయగనే ఆమక్షిామవల్ల జ్ఞానియై ముక్తుఁడగును.

కాశ్యామవశ్యంత్యజతాం శరీరం శరీరిణాం నాస్తిపునశ్శరీరం
యద్యాస్తికం రేగరళంచఫాలే విలోచనం చంద్రకళాచమౌళే॥

అని కొందరన్నారు. మరియు,

శశకోహం మశకోహం పురామ్మాత్మలింగోహం॥

అని ఇవిమొదలుగా నూతనపశుపతిరూపములయినట్లు ఉన్నదిగదా, కాగా సవిశేషమయిన ముక్తిని "కాశ్యాంతు మరణాన్ముక్తిః అనినను అందుకు పొందును. ఆ యుపాధిక్షయమందు నిర్విశేషసాయుజ్యమును పొందునని అన్నారు. అదియును విరోధము లేదుగదా, అయినను ప్రథమపక్షమేమంచిది. ఇదిగాక ప్రాణిప్రాప్యమును తెలసి కృతార్థునికి బ్రహ్మతారకమును విష్ణుపదప్రాపకుని రామతారకమును, శివలోకప్రాపకునికి శివపంచాక్షరీ తారకమును చెప్పునని కాశీఖండమందున్నది. గనుకను విరోధములేదు అని ఈలాగు శ్రీగురువులు దయాపూర్వముగఁ జెప్పిన రహస్య తత్వమును జిజ్ఞాసుఁడు విని వందనముఁజేసి స్వామీ! మీరువ్యష్టి సమష్టితోఁగూడిన పిండాండ బ్రహ్మాండోత్పత్తిస్థితి భంగములును, ఈశ్వరజీవత్వములును, ప్రణవస్వరూపమును, మహావాక్యలక్షణమును, సమాధిభేదలక్షణమును, వైరాగ్యబోధోపరతుల ప్రకారమును శాస్త్రజన్య జ్ఞానముచే నానతిచ్చిరి గనుక కృతార్థుఁడనైతిని. స్వరూపముదయచేసి అందీయరైతిర నేశంకచే నామనం బాందోళపడుచున్నయది తగినవాడనైతి నేని ఆనతీయవలయునని వినీతుఁడైన యాతనకిఁ బోడమిన వివేకమున కానందపడి వృద్ధప్రత్యేరీతిచేత చెప్పకకాని తెలియదనుకొని దగ్గరగాఁ బిలచి రహస్యముగ వినుమని సకల వేదవేదాంతములును

యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ॥

అని శ్రుతియున్నదే? ఇట్టి తెలియరాని బ్రహ్మము నెట్లు చూపి తెలుపుదును. అయితే ఉపనిషద్వేద్యం బ్రహ్మమన్న శ్రుతికి తాత్పర్యమేమంటే చెప్పుచున్నారు. పరాక్ప్రవణమయిన ప్రమాతను ప్రత్యక్ప్రవణముఁజేసుననుట అయినను నీవారురుక్షువుగదా? మాశ్రీగురువుల యనుగ్రహముచేతను చెప్పికఁ జెప్పుచున్నారము వినుమని రహస్యముగాఁ జెప్పఁదలచి ఆనతిచ్చుచున్నారు. "అనాది మత్పరం బ్రహ్మనసత్తన్నాసదుచ్యతే" గనుక హేయోపాదేయమై సదసద్విలక్షణమైన ఆత్మనిజాసము దుర్ఘటంబు. వృద్ధప్రత్యేకవేకముచేత తెలుసుకొని దృక్కల్లా దృశ్యమై యెక్కడ దృశ్యములేక దృక్కునిలుచునో, అదియె ఆత్మ, ఆ యాత్మయే నీవు, అందుకు లక్షణము,

"కింజ్యోతి స్తవభానుమాన హనిమేరాత్రౌ ప్రదీపాదికం
స్యాదేవంనవిదీపదర్శన విధౌ కిం జ్యోతిరాఖ్యాహిమే
చక్షు స్తస్యనిమీలనాది సమయేకిం ధీర్ధియో ఓర్శనే
కింతత్రాహమతో భవాన్పరమకం జ్యోతి స్తదస్మిప్రభో॥

అన్నారు గాన నోయీ, నీకేమి ప్రకాశించుచున్నవని యడిగితే పగలుసూర్యుఁడు రాత్రి దీపాదికమును అనెను. అవియెందుచే చూచుచున్నావనిన నేత్రముచే చూచుచున్నానని నెను. ఆ కనులుమూసి వాటినిఁజూడుము. ఆచూచుట యేమిటి చూచితివంటి వేని నా మనస్సుచే చూచితినని నెను. ఆమనస్సునకు మరుపువున్నదే? అది యెట్లు దుచేకంటి వనిన, నేను కంటిననని విన్నపముచేసిన పిదప ఆ తెలివియే నీవునీవే ఆత్మయని మర్మముఁ దెలిపి ఆవరకమెడబాపిన యానందించి విన్నపముఁజేసికొనుచున్నాడు. స్వామీ, మీరానతిచ్చిన విధంబుగ జ్ఞానదృష్టిచే విచారించిన ఆత్మయే అంతటా నిండియున్నది. తిరుగఁబడి చూచిన జగంబుండి యున్నది. అనిన యానతిచ్చుచున్నారు.

జగద్భాతిచే ద్భాతుభానంత్వమేవ ప్రపంచో స్తిచేదస్తుసత్తాత్వమేవ
రసాన త్తిచేదత్తుచేతస్సుఖంత్వం, ప్రమాదోవధానంకు తస్త్వయ్యనంతే॥
"అ స్తిభాతిప్రియంచైవ నామరూపాంశ పంచకం
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం"

అన్నారు గనుక సకలవస్తువులకు నామరూపములుతోసివేసిన న స్తిభాతిప్రియములే శేషించుచున్నవి. అదియే ఆత్మ స్వరూపము, ప్రపంచముతోచిన నాతోచు భావమే చిత్తు, ప్రపంచమున్నదంటివేని ఆయున్నదనే సత్త ఆత్మ. వస్తువులయందు ప్రేమవున్నదంటివా, ఆప్రీత్యానందమే ఆత్మ. ఈలాగుగా విచారించితే సచ్చిదానందములే వుంచున్నవి. అదియే ఆత్మ ఆ యాత్మయే నీవు. అజ్ఞానదృష్టిచే జగత్తుతోచిన మాత్రాననేమిహాని.

చిద్విలాసః ప్రపంచోయం సఖేతే దుఃఖదఃకథం
కిమింద్రవారుణీరామ! సితాంతాతి క్తతాం వ్రజేత్॥

గనుక నీతోచే జగత్తు వాస్తవమేకాని అన్యముకాదు. అదియెటువలెనంటే జీవరూపముగా నున్నదేయ నేవు.

జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్
మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః॥

అన్నారు గనుక జీవకోటి ఈశ్వరాంశకాదా? కాగా వాస్తవమేగాని ఇతరములే దు. పంచదారను వెఱ్ఱిపుచ్చకాయవలె వుండచేసితిననిన చేదగునా? భ్రమసిన మాత్రమున చిద్విలాసము కాకపోవునా? వెరవకుము ఒకానొకవేళ ప్రమాదముచే సమాధిచ్యుతమై వృత్తిపరాక్ప్రవణమై వ్యాపించినప్పటికిని

"యచ్చకించిజ్జగత్సర్వం దృశ్యతేశ్రూయతేపివా
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః"

దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యమైన ఆత్మయే పరిపూర్ణముగ నున్నది గనుక వృత్తి పూర్వోక్త ప్రకారమున విషయప్రవణమైనను ఈమర్మం తెలిసికొని అంతయు తానై యున్న స్థితి తెలిసెను గనుక అతత్తు

"అంతర్భావేనంతభవంతమేవహ్యాతత్త్యజంతోమృగయంతిసంతః
అనంతమప్యంత్యహిమంతరేణ సంతంగుణాంతం కిముయంతి సంతః॥

గనుక రజ్జువందు భ్రమచే సర్పముతోచినను, ఆప్తవాక్యముచే సర్పముగాదు. రజ్జువని తెలిసినటు నేను జీవుండనుగాను ఆత్మనని అతన్నిరసనపూర్వకముగ దృఢపరచుకొని యుండుమనిన స్వామీ! యోగమని చెప్పుదురు. దానిస్థితియేమనిన కర్మయోగము యోగమేను. అది నీవడిగిన సంకేతపుదిగాదు. ఈ యోగము వాయుధారణాపూర్వకముగా నుండును. అదియును సాధనమేగాని సాధ్యముగాదు. యమనియమాసన ప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధులను అంగములు గలిగి హఠమంత్రలయముల జయించిన యోగము రాజయోగమునకు పూర్వాంగము. ఇవిచాలవరకు ఆయాసపూర్వకములుగాని సుకరములుగావు. వాటి స్వరూపమును చెప్పుటకు కర్మవలెనే మహాగాధ.

"యోగశ్చిత్తవృత్తినిరోధః"

గనుక వృత్తినిరోధమే యోగమగును. వృత్తిలయము బ్రహ్మభావముకాదాయనిన కాదు. అందుకు యుక్తి, లోకములో దొమ్మరివాడు మోకుమీద గడమీదచేసే సాహసములు చెప్పతరమా అదంతయు వృత్తినిరోధముచేతనేకదా? కాగా నది మోక్షమని చప్పరాదుగదా? వాయుధారణచేతను, నాళిశోధింపఁబడి కుండలి యూర్ధ్వముఖముగా లేచ్చును. వాయువు ఊర్ధ్వగతముకాఁగానే కేవల కుంభకముచే నాదము శ్రవణమవును దానియందు చిత్తము లీనముకాగానే తత్కాలమందమాపూర్ణిమం దృష్టుల న్విడచి గురూపదిష్టమగు ప్రతిపద్దృష్టిచే దృష్టినిరోధమొనర్చిన నాజ్ఞాచక్రము చంద్రసూర్యాగ్ని సంఘ

లాత్మకము కనుకను సూర్యదైవత్వము గనుకను అంతస్థముగుజ్యోతిస్సు బహిర్గతమై బహ్యప్రత్యయరూపములుగఁదోచును. అంతర్జ్యోతి బైట ప్రత్యక్షమహిమచేతను వృత్తిరాహిత్యముచేతను ఇట్టి వికృతిఁ బొందెనని నిధిధ్యాసతో నుండవలయును. గురువులరలేకఁ దెలిపిన తెలివి స్వరూపముగఁ జూడఁగ జ్ఞానేతానై తనుగూడ మరచి యఖండాకార కారమై వృత్తిలేకయుండుట కృతార్థతగాని కేవలవృత్తిలయముచేఁ గృతకృత్యుఁడుకాడు. ఇదిగాక సుషుప్తిమూర్ఛలయందున్నూ వృత్తిలేదుగదా? అప్పుడు కృతార్థుఁడైనాడా? కాకకృతార్థతఁబొందిన పిదప ప్రత్యక్ప్రవణమయిన చిత్తముపరాక్ప్రవణమొకకాలమందయినను హానిలేదు. నా స్తంభకాకమునంబలె తిరుగనచ్చుటనేచేరును.

నాప్రతీతిస్తయోర్బాధాకింతు మిథ్యాత్వ నిశ్చయ నోచే త్సుషుప్తిమూర్ఛాదౌ ముచ్యేతాయత్నతో రసః॥ తయోః

అనఁగా జగజ్జీవులు వాటియొక్క ప్రతీతికి లేకపోవలెననే బాధకుపనిలేదు. మరియేమనిన వాటిమిథ్యాత్వ నిశ్చయముఁ గావలసినదె బాధయని అనతిచ్చిన,

ఋతంపిబంతంసుకృతస్య లోకేద్వాసుపర్ణాసయుజాసఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి అజోహ్యేకోజుషమాణోనుసేతేజహాత్యేనాం భుక్తభోగామజోన్యః॥

అని భేదశ్రుతులున్నవి. ఇందుకేమని విన్నపముఁజేసిన చెప్పుచున్నారు.

జీవఈశోవిశుద్ధాచిత్ తథాజీవేశయోర్భిదా
అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాకమనాదయః॥

అని అద్వైత సిద్ధాంతముగదా? ఇవి వ్యవహారకాలమునుగూర్చిన శ్రుతులు ఇందును మొదటనేకదా చెప్పితిమి. సృష్టికిపూర్వకాలమునను ఉత్తరకాలమునను చైతన్యమొకటేయుండును. సృష్టికాలమున ఈశ్వరుఁడని జీవుఁడని ఉపాధివశమునఁ దోచునని చెప్పితిమి.

మనోవృత్తిమయం ద్వైతమద్వైతం పరమార్థతః॥

కాగా తన్నావరించిన మాయానున్నూ మాయాకార్యములనున్నూ మిథ్యగా తెలిసికొని

శాస్త్రేణ నశ్యేత్పరమార్థరూపం కార్యక్షమం నశ్యతి చాపరోక్షాత్ ప్రారబ్ధనాశాత్ప్రతిభాసనాశః। ఏవం త్రిధా నశ్యతి చాత్మమాయా॥

గనుక సందేహము విడచి,

యోఽన్యాం దేవతాముపాస్తే న స వేద యథా పశుః॥

అని శ్రుతియున్నది గనుకను అన్వయ వ్యతిరేకములచే నాత్మయేగాని రెండవవస్తువులేదు గనుకను అన్వయమనఁగా నాత్మసత్యము గనుక తత్ప్రకాశవలన జగత్ప్రకాశ, ఘటస్స్ఫురతి పటస్స్ఫురతి అనుచున్నది గనుక అనువృత్తిచే నన్వయమందురు. మాయమిథ్యయేగనుక తత్కార్యమై జగద్రూపమగు నామరూపములు మిథ్యయనునది వ్యతిరేకము ఇందుకు దృష్టాంతము మృత్తు సత్యమైయుండి ఘటాదికము సత్యమైనట్లును రజ్జుసర్పభ్రమయందు భ్రమనివృత్తియయిన పిదప సర్పము లేకపోయినట్లును ఉభయత్ర దృష్టాంతములయిన మృత్తు రజ్జువులు సత్యమైనటులే అధిష్టానమే సత్యమని "ఏకో దేవ" ఇతి అనే శ్రుతులు నమ్మికొని నిస్సందేహుఁడవై స్వరూపానుభవము చేసుకొనుచు

"అదృష్టమవ్యవహార్యమగ్రాహ్యమలక్షణమచింత్యమవ్యపదేశ్యమేకాత్మ ప్రత్యయసారం। ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః॥"

అని శ్రుతులున్నవి గనుక ఇటువంటి వస్తువే నీవని యానతిచ్చిన నాయర్థము గ్రహించి సంసారసాగరము తరించితి ననుకొని

"అహమాత్మవధూసుతానుజాతైరహమావాం వయమగ్రహైరలగ్నైః। అపరిక్షిత విగ్రహోఽస్మి పుణ్యాదనయా దేశికయాతయా శరణ్యః॥

అన్నారు గనుక శ్రీగురుమూర్తులవలన పుత్రదారాది మమత్వసత్వమూతనొందక వారి కృపకు పాత్రుఁడనైతి ననుకొని స్వామీ! నేననునదియున్న దేయనిన నదియేకదా చిక్కు. ఆ యహంకృతిని విడువవలెను.

"దేహేంద్రియ మనఃప్రాణాహంకృతిభ్యో విలక్షణం। సచ్చిదానంద మద్వైతం పరంబ్రహ్మాస్మి కేవలం॥"

గనుక నిటువంటి దేహేంద్రియ ప్రాణమనోబుధ్యాదులకు విలక్షణమై యహంకృతి వివర్జితమైనటువంటి సచ్చిదానంద స్వరూపమయిన ఆత్మతాననే యనుభవముఁ గలు

గుట. అదియే పరంతభావమని తెలిపిచ్చితే ఆయుపదేశమువలన ఆనందము కలిగి యనన్యస్థుండై గురువును తనను మరచి నిదిధ్యాసను వుండెను. ఈలాగుగా వేదాంత శాస్త్రములచేతనున్నా సద్గురూపదేశములచేతనున్నా సంసిద్ధమయిన స్వానుభవమే రాజయోగము గనుక ఖేచరీ శాంభవీముద్రలచేత సంసిద్ధమగు సమాధి నిదిధ్యాసను ఐక్యమాయను గనుక,

"అంతర్లక్ష్యం బహిర్దృష్టి ర్నిమేషోన్మేషవర్జితా। ఏషాసా శాంభవీముద్రా సర్వసంకల్పవర్జితా॥"

ఇట్టినిదిధ్యాసనుపొంది బ్రహ్మవిద్వరిష్ఠభావముననుండి జాగ్రత్స్వప్నసుషుప్తితురీయములకు ఒకటొకటికి నివి యేనాలుగు నాలుగవస్థలు గలవు గనుక నాపదియారు భావములును లోకులుచూచి తరించులాగున నుండుచు, పరగుడి శ్రీగురువులకు వందనముచేసితే అసంప్రజ్ఞను పొందిన యతని కృతార్థతకు గురువులు సంతసించి ఓయీ, నీచిత్తవృత్తి ఇపుడేలాయున్నదనిన చిత్తము వృత్తియు తోచలేదని విన్నపమొనర్చిన ఏలతోచలేదు. ఎటుపోయెనంటే, స్వామీ, అవిద్యాకార్యాలు కాణాచయిన యవిద్యయే మిథ్యయైనపుడు. ఇవేమియు తోచకపోయెను. మీ యుపదేశప్రకారముగ నా యనుభవములా యున్నది. ఎంత విచారించినను పండువెన్నెలబయలువంటి మీ శ్రీచరణమేయున్నదిగాని రెండవవస్తువుతోచలేదని విన్నపమొనర్చిన అందుమీద నాతని దృఢజ్ఞానమును మరియుం దృఢముసేయఁదలచి ఓయీ,

"తదేషాంనప్రియం యదేతన్మనుష్యావిదు"

రితి శ్రుతి గనుక నింతవట్టు అయిన బ్రహ్మమును మనుష్యులు తెలసి కృతార్థులగుట దేవతలకప్రియముగదా యనెదవేని "తస్యహనదేవాశ్చనాభూత్యాఈశతే ఆత్మాహ్యేషాం సంభవతి" అని శ్రుతియున్నది గనుక దేవతలున్నూ ఆత్మజ్ఞానికప్రతిబద్ధసాక్షాదపరోక్షజ్ఞానమును పొందకుండఁ జేయుటకు సమర్థులుకారని యున్నారు గాన మును చెప్పిన శ్రుతితాత్పర్యం॥ జ్ఞానోత్పత్తికి పూర్వమేను. ఇది గాక అప్రియమనుటగాని విఘ్నము సేయుదురని తాత్పర్యముఁ గాదు నమ్మమని అనలెచ్చి

నాయమాత్మా బలహీనేనలభ్యోనచ ప్రమాదాత్తపసోవాప్యలింగాత్। ఏతైరుపాయైర్యతతేయస్తువిద్వాంతస్యైష ఆత్మావిశతే బ్రహ్మధామ నాయమాత్మా ప్రవచనేనలభ్యో నమేధయానబహునాశ్రుతేన। యమేవైషవృణుతే తేనలభ్యః తస్యైష ఆత్మావివృణు

తేతనూస్వాంయావన్నాను గ్రహాస్సాక్షాజ్జాయితే పరమేశ్వరాత్। యావన సద్గురుంకం చిత్సచ్ఛాస్త్రంచాపినోలభేత్। ఏష హ్యేవసాధుకర్మకారయతి తమేభ్యో లోకేభ్య ఉన్నినీషత ఏషఏవాసాధుకర్మకారయతితం యమేభ్యోలోకేభ్య అధోనినీషత॥

అని శృతులున్నవి గనుక స్వరూపము ప్రవచనములచేతను, ప్రమాదమువల్లను, బలహీనునిచేతను, అనుక్తతపస్సులచేతను మేధచేతను బహుశృతముచేతను లభ్యపడునది గాదు. సచ్ఛాస్త్రోక్త గురూపదిష్టోపాయములచే స్వరూపము తెలియఁబడును. అదెటులనంటివేని విధివిధానములచే సంతుష్టమగునాత్మ వాని ననుగ్రహించఁదలచి గురుస్వరూపమై తన్ముఖముచేఁ గృతార్థునిఁజేయును. సద్విధానములు చేయకున్న సంతుష్టినొందడు సద్గురువున్నా దయచేయడు॥

అనన్యాశ్చింతయంతోమాం యేజనాఃపర్యుపాసతే
తేషాంనిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం॥

అని ఈశ్వరుని ప్రతిజ్ఞయున్నది గనుక నెవరైన నేమి యంతర్ముఖులై తనకన్న నితరముతోచకుండా తన నే మననము చేయుచుండే అదే ప్రత్యగభిన్నబ్రహ్మానుసంధానము గనుక నదియె యోగము గనుక నాయోగమున్నా క్షేమమన నిర్విఘ్నసమాధినిన్నీ ఈశ్వరుఁడు దయచేయును.

"తదితఇతరం పశ్యతి సృతోస్యమృత్యుమాప్నోతి"

అని యున్నది పరోక్షముగ విచారించక అపరోక్షముగనుండినఁ గృతార్థుఁడౌను.

యానిశాసర్వభూతానాం తస్యాంజాగర్తిసంయమీ
యస్యాం జాగ్రతిభూతాని సానిశాపశ్యతోమునేః॥

అనియున్నందున ప్రాపంచికులకు తన స్వభావము తెలియకుండునట్లుగా ప్రపంచ విముఖుఁడై విజ్ఞాని నను నజ్ఞానోక్తులు పలుకక నపరోక్షానంద మనుభవించుచుండవలెను.

"యస్యదేవేపరాభక్తిర్యథాదేవే తథాగురౌ"

అని శృతి కనుక గుర్వీశ్వరులకు విభేదములేదుగాన నీయర్థము నమ్మి సుఖముగ ప్రారబ్ధానుభవ పర్యంతముండును.

"తస్యతావదేవచిరంయావన్న విమోక్ష్యేదథసంపత్స్యే"

అని శ్రుతి యడిగినదని విగిరించవలెనని ఆనతిచ్చిన స్వామీ!

"ఆవృత్తిరసకృదుపదేశాత్ ఆమ్నాయణే తత్త్రాపిహిదృష్టం"॥

అని బ్రహ్మసూత్రములున్నవి గాన శ్రవణ మనన నిదిధ్యాసలును నిర్వి సమాధియు మరణావధిగా కావలెననియుండెనే? బానవము కాల ఏవముక్తిః అని చెప్పితిరే? ఈ విచారమునకేమియంటే ఆ బ్రహ్మసూత్రములకు విషయము సగుణబ్రహ్మోపాసకులు సద్గురు కటాక్షముచే నావరకముండాకినప్పటికి నీప్రతిబంధ బాహుళ్యముచేతను సంశయ నివృత్తిగాక యుండును. కాగానే బహుమార్లు ఆమరణపర్యంత మననమా త్రోపదేశముల కు తాత్పర్యం చరమశ్వాశ్యానంతర బ్రహ్మసాక్షాత్కారమయిన నిర్గుణబ్రహ్మజ్ఞానిమైతే అప్పుడే ముక్తుండు గనుక దేహముప్పుడే లేదు. గనుక సంశయ నివృత్తియయినదిగాన వానికి పనిలేదు అని యానతిచ్చితే స్వామీ! ఏకజీవాదులకు అభిప్రేతమేమని విన్నపముచేసుకుంటే ఆనతిస్తున్నారు. వారి యభిప్రాయమును యుక్తిని చెప్పుచున్నారు. సకల సత్కర్మములచే చిత్తశుద్ధియగును. తద్వారా ప్రతిబంధరాహిత్యమయి సద్గురు కటాక్షముచే స్వరూప మపరోక్షమగును. ఆయానందమనుభవించుచూ ఈశ్వరత్వము వచ్చి తదుపాధిచేత పురుషున్న బహుజనులీలాగు యత్నము సేయగా సృష్టిస్వంపానంతరమందు సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్ గనుక నఖండ సచ్చిదానందాపవర్గ స్వరూపమైయుండగాన నొకానొక జీవుండు కృతార్థుండైతే వాని లింగశరీరభంగమై స్వరూపావాప్తుండాయునే? ఆ స్వరూపమేకదా మిగిలిన అంతఃకరణములకు బింబము. చైతన్యమైన ఆత్మకు నాబద్ధత లేదా? కాగా ఇనియంత హెచ్చు, ముక్తికి పూర్వోక్తరీతిని యత్నము సేయంగా నొకకాలమున నగునని వారి యభిప్రాయము. అదిమంచిదయినా?

"బహవో జ్ఞాన తపసా పూతా మద్భావమాగతాః॥

అని శ్రీ భగవద్గీతాప్రమాణమున్నది నమ్మికొని

మనోనిగృహ్యైకింపర్యాత్మానం చరతుష్టతు
యద్యద్భాతితదేవాహం యన్నాహం నైవవస్తుతత్
పద్మపత్రం యథాతోయైః స్వస్థైరపి నలిప్యతే
తథాశబ్దాదిభిర్నాయం విషయైర్నహిలిప్యతే॥

గనుక సుఖముగా ప్రత్యఙ్ముఖుండవై ఈరీతినుండుమని

స్నాతం తేన సమస్తతీర్థనిచయేదత్తం మహీమండలం
విప్రేభ్యః పితృదేవతాస్సురగణా స్సర్వేపి సంతర్పితాః

జన్మాంతర సహస్రకోటిరమునా తత్త్వం పత్త్రసంచేపో
యస్య బ్రహ్మవిచారణేక్షణమపి ప్రాప్నోతి స్థైర్యం మనః॥

అని మహాఫలమున్నది గనుక సుఖముగా బ్రహ్మవిచారముచే కాలమును వెళ్ళించుము ఇత్యద్వైతరహస్యము.

"ఇదంతేనాతపస్కాయ నాభక్తాయ కదాచన
నచాశుశ్రూషవే వాచ్యం నచమాం యోభ్యసూయతే॥

ఇట్టివానికి బ్రహ్మోపదేశము సేయక "యజ్ఞేనదానేన తపసానాశకేనేతి" గనుక నిట్టి జిజ్ఞాసునికి బ్రహ్మోపదేశముచేసిన అనిర్వాచ్యమయిన మహాఫలమనిచెప్పి "గురోస్తు మౌనంవ్యాఖ్యానం" అని యూరకుండిన నాభావముం దెలిసి

"యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్ తత్రకేనకంపశ్యేత్ కేనకం విజానీయాత్ అహినిర్ల్వయిని వల్మీకే మృతాప్రత్యస్తాశయీతైవమేవేదగ్ం శరీరగ్ంశేతేథాయమ శరీరో ప్రాణోమృత। సచక్షురచక్షురివసకర్ణోకర్ణ ఇవసవాగవాగివ సమనోమన ఇవసప్రాణో ప్రాణ ఇవచేతి। అని తేలెస్థిరమతి నిత్యతృప్తోనిరాశ్రయః ఆత్మన్యేవచ సంతుష్టస్తస్య కార్యంనవిద్యతే॥

ఈలాగుగా శ్రుతిస్మృతులున్నవి గనుక "శిష్యస్తుఛిన్నసంశయః" గనుక నిస్సందేహుండై ఈరీతిని జీవన్ముక్తుండై తదనంతరమందు కైవల్యమును పొందెను.

ఇతి శ్రీ గుంటుపల్లి వంశకలశపాథోనిధిశశాంక శ్రీమదద్వైత విద్యాసంప
న్నిష్కళంక సిద్ధశాంతస్వాన్తస్య యల్లపాఖ్యస్య గ్రథితంబైన
అద్వైత మకరందం బను మనన గ్రంథము సర్వము

— సమాప్తము. —

---

శ్లో॥ శ్రీమద్గుంటుపలీ కులోద్భవ సతా యల్లప్పనామ్నాకృతో
గ్రంథోయం పరమాత్మజీవజనితా సంబోధక ప్రక్రియః
సంధానగ్రహకామ్యయా[illegible]గురోః కారుణ్యసంపద్బలా
ల్పంతత్త్వభక్త రోదజ[illegible]సకలనాస్తుమ్యంచ్ఛలోదర్శనాత్

అముష్యకర్మణః ప్రత్యగభిన్న సచ్చిదానంద శ్రీపరశివ స్వరూప రామగురు హ్మైవ ప్రేరకం.

శ్లో॥ కింనత్వం నరసింహ ఏవయదివా నాహం సశోచేత్కథం
బంధోమయ్యఖిలేశ్వరేత్వయివిభో! కిన్నాస్తిమత్తః పరం
భూయాదర్ణవదాత్మ బంధహర ఇత్యాద్యంవచోపౌరుషం
నత్వంనాతదహంత్వమేవ నృహరే! భూయాసమాత్మన్ స్త్వయి॥

శ్రీసాంబశివగురుబ్రహ్మార్పణమస్తు.

---